

# పశ్చాత్తాపము !

ఆకాశంలో సగం, జీవితంలో అర్ధభాగం, తనతో ఏడడుగులు నడిచి, కడవరకు వెన్నంటి వుండేది భార్య. భార్యాభర్తల అనుబంధం వివాహంతో ముడివేయ బడుతుంది. అప్పటివరకు ముక్కు-మొహం ఎరుగనివారు సైతము ఈ పవిత్రబంధం వలన ఏకమగుదురు. మహాత్ములు సైతము సంసార బాధలు, కొన్ని తప్పిదములు పూర్వాశ్రమంలో చేసియుండును. వారు తమ విషయాలు త్వరగా గమనించి చెడు మార్గం వదిలి సమాజ శ్రేయస్సుకు అగ్రగామిగ నిలుస్తారు.

అక్టోబర్ 2 న మీరు గాంధీజీ జన్మదినము మీ పాఠశాలలో జరుపుకొని యుందురు. ఆయననే 'బాపూజీ' అని మనం గౌరవించుకుంటున్నాం. అసలు పేరు "మోహన్‌దాస్ కరంచంద్ గాంధీ" అన్నమాట. ఈయన గుజరాత్ రాష్ట్రంలో పోర్‌బందర్‌లో జన్మించారు.

ఆయన జీవితంలో జరిగిన ఒక మహత్తర సంఘటనయే ఈ కథకు మూల రూపం.

గాంధీజీ దక్షిణాఫ్రికాలో లాయర్‌గా ప్రాక్టీసు చేస్తున్న రోజులు అవి. అతనివద్ద చాలామంది గుమాస్తాలు పనిచేసేవారు. వారిలో హిందు, ముస్లిం, క్రైస్తవులు గలరు. వారు ఎక్కువ కాలం గాంధీజీ నివాసంలోనే నివసించేవారు.

నివాస గృహంలో మురికి నీరు బయటకు పోవు మార్గం లేనందువలన ప్రతి గదిలో మూత్ర సౌకర్యార్థం పాత్రలుంచుకునేవారు. అది నిండిన తరువాత బయట పారబోసేవారు.

ఒక రోజున నొక క్రైస్తవుడు పాత్ర శుభ్రంచేయకుండా బయటికి వెళ్ళిపోయాడు. గాంధీజీ కస్తూరి భాయికి ఆ పనిని పురమాయించెను.

ఆమెకు ఆ పని సుతారమూ ఇష్టములేదు. అధిక కులంలో పుట్టి నిమ్మకులస్తుని నీచపు పని చేయడం అసలే నచ్చలేదు. గాంధీజీ మళ్ళీ ఆ పాత్రను శుభ్రంచేయమని ఆదేశించెను. ఆమెలో పట్టుదల పెరిగెను. నేను చేయనుగాక చేయనని తెగేసి చెప్పింది. గాంధీజి తన మాటపై విలువనివ్వనందుకు కోపం వచ్చెను. చెప్పిన మాట విని ఆ పని చేస్తావా? లేదా? అని అరిచెను.

మొండితనంతో ఆమె నావల్లకాదనెను. ఇంకేముంది దక్షయజ్ఞ సమయంలో సదాశివుడు కోపంతో నాట్యం చేసినట్లు భార్యపై కారాలు మిరియాలు నూరుతూ గ్రుడ్లు పెద్దవిచేసి "ఇది నా ఆజ్ఞ ? చేస్తావా లేక ధిక్కరిస్తావా? లేకుంటే మీ ఇంటికి వెళ్ళు" అని ఛీత్కరించెను

ఆమె పట్టుదలతో "అసలు మనం ఉండేది నీదైతేనేగా నేను బయటకు వెళ్ళాల్సిన అవసరం వచ్చేది. ఇది అద్దె ఇల్లు" అని పెంకిగా సమాధానమిచ్చెను.

పట్టలేని కోపంతో దుర్భాషలాడుతూ! "ఛీ దరిద్రురాలా! నా గుమ్మం వదలి పో" అని ఆమె చేయి పట్టుకొని బరబరమని ఈడ్చి బయటకు తోసాడు.

ఆమె భయంతో ఇది ఊరుకాని ఊరు! దేశంకాని దేశం. నా బంధువులు, మిత్రులు, ఎవరూ నన్ను ఆదుకొనేవారు లేరు. అయ్యో, నా గతేమిటి? అని విలపించెను.

తాటాకు మంటలా గాంధీజీ కోపం చల్లారెను. తను చేసిన పనికి సిగ్గుపడెను. ఆమెను లోపలికి తీసుకొచ్చెను. స్త్రీలపై అత్యాచారం, నిందలు వేయటం, దుర్భాషలాడటం ఎంత ఘోరమగు సత్యమో అంతరంగాన తలచి బాధపడెను. ఇకపై ఇటువంటి చర్య పునరావృతం కాలేదు. కస్తూరిబా గాంధీజీ అడుగుజాడలలో నడిచి మహోన్నత స్త్రీమూర్తిగా స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొనెను.

యామిజాల జగదీశ్ – హైదరాబాదు

# చేసుకుంటే తప్పేంటి !

అమెరికా అధ్యక్షుడిగా సేవలందించిన అబ్రహాం లింకన్ నిరాడంబర జీవి. ఆయన అమెరికా అధ్యక్షుడిగా వున్న కాలంలో ఒకరోజు లింకన్ ఇంటికి ఓ కోటీశ్వరుడు వచ్చారు. ఆ సమయంలో లింకన్ తన బూట్లను ఆయనే శుభ్రం చేసుకుంటున్నారు. ఆ దృశ్యం చూసి కోటీశ్వరుడు ఆశ్చర్యపోయారు. అయినా కోటీశ్వరుడు ఆగకుండా "ఏమిటి దేశాధ్యక్షులు గారూ! మీ బూట్లకు మీరే పాలిష్ వేసుకుంటున్నారు. మీరేంటి? మీ హోదా ఏంటి? అలాంటి మీరు ఈ పని చేసుకోవడమా?' అని అవహేళన స్వరంతో అడిగారు.

వెంటనే లింకన్ "మీరు ఇలాంటి పనులు చెయ్యరా? అయితే మీరు మరొకరి బూట్లకు పాలిష్ చేస్తారా?" అని వ్యంగ్య ధోరణిలో ఎదురు ప్రశ్న వేసారు.

ఈ ప్రశ్నకు కోటీశ్వరుని నుండి ఎలాంటి జవాబు లేదు. మొహం కందగడ్డలా మారిపోయినా చేసే దేమీలేక సిగ్గుతో తలదించుకున్నారు. ఎవరి పనులు వాళ్లు చేసుకోవడంలో తప్పేమీలేదు. అలా అనుకోవడం పిచ్చితనం కూడాను.



డి.కె. చదువులబాబు – ప్రొద్దుటూరు








అతిథులను సత్కరించే సత్సంప్రదాయం మనది. ఇది అందరూ పాటించవలసింది. ఇది అవసరంకూడా. ఈ చిన్ని పొట్టకు శ్రీరామరక్ష అనుకోవడం ఏ మాత్రం సరికాదు.

అతిథౌ తిష్ఠతి ద్వారే
హ్యాపో గృహ్ణాతి యోనరః
ఆపోశనం సురాపానం
అన్నం గోమాంస భక్షణమ్॥




అంటే అతిథి సత్కారం అనేది భారతీయులకు ఎప్పటినుంచో వస్తోంది. వాకిలిలో అతిథి ఉన్నప్పుడు అతన్ని పట్టించుకోకుండా ఇంటి యజమాని భోజనానికి కూర్చోవడం పాపానికి పాపం! అటువంటి వ్యక్తి పట్టే ఆపోశనం కల్లుతో సమానం. అతను తినే ఆహారం గోమాంసంతో సమానం. దీనినిబట్టి తెలుసుకోవలసిందేమంటే అతిథిని అన్నివిధాల చక్కగా చూసుకోవాలని.

అందుకే అతిథి దేవో భవ అని మన పెద్దలు ఉట్టినే అనలేదు. దీనికున్న ప్రాధాన్యం గుర్తెరిగి నడుచుకోవడం అన్ని విధాల మంచిది.




సంపుటి : 39 February-2013 సంచిక : 1
విడిప్రతి వెల : 15.00 సం॥ చందా రూ.180.00




# "అందుకే అడగాలి !"

సాయంకాలము బడినుండి ఇంటికి వచ్చాడు శివ. ఆ సమయానికి కరెంటులేదు. పుస్తకాల సంచి సోఫాలో పడేసి కాళ్లు కడుక్కునేందుకు పెరటిలోనికి వెళ్ళాడు. కాళ్లు కడుక్కుని తిరిగి వచ్చేటప్పుడు ఆకలితో వంటింట్లో చూచినప్పుడు పొయ్యిమీద మూకుడు కనిపించింది.

మూత తీసి చూసేటప్పటికి అందులో సగం వరకు తెల్లగా ముద్దలాగ కనిపించింది.

ఓహో... అమ్మ ఉప్మా చేసింది.. అనుకుంటూ చెమ్చాతో ఆ ముద్దలోనిది తీసుకుని నోట్లో వేసుకున్నాడు. అంతే.. నోరంతా ఉప్పుకసం..అయిపోయింది.

మేడమీద ఆరబెట్టిన బట్టలు తీసుకుని అప్పుడే క్రిందకు వచ్చింది అతని తల్లి భగవతి.

"మూకుడులోనిది ఉప్మా అనుకుని నోట్లో వేసుకున్నానమ్మా..." అన్నాడు శివ.

"శివా.. వర్షాలవల్ల ఉప్పు గుంట చెమ్మకు ముద్దయిపోయింది. వేడిచేద్దామని మూకుడులో వేశాను. ఇంతలో వర్షం రావచ్చుననే అనుమానంతో బట్టలు తేవడానికి మేడమీదికి వెళ్లి వస్తున్నాను. ఈ లోపల నువ్వు ఈ ఘనకార్యం చేశావు. అందుకే ఏదైనా కావాలనుకుంటే అడగాలి. ఇదే దీపావళి ముందు ఏ సురేకారమో వెచ్చపెట్టడానికి వేశాననుకో.. ఇలాగే చేస్తే డాక్టరు దగ్గరకు పరుగెత్త వలసి వచ్చేది." అన్నది భగవతి.

నోరు కడుక్కుంటూ నాలిక పీక్కోసాగాడు శివ.

అందుకే ఇంట్లో జాగ్రత్తగా వ్యవహరించాలి. లేకపోతే ఇలాంటివి ఎదురౌతాయి.





ఎన్.వి.ఆర్.సత్యనారాయణమూర్తి – బొబ్బిలి



# బాలల భారతం

"ఇక్కడే వుందిరా మనవడా కిటుకు! దేవకీ, వసుదేవులకు ఎనిమిదో సంతానంగా అష్టమి నాడు విష్ణువు అంశంతో జన్మించిన కృష్ణుడు పుట్టగానే అర్ధరాత్రి వసుదేవుడు ఆ బాలుణ్ణి పొత్తిగుడ్డల్లో చుట్టుకుని తట్టలో పెట్టుకుని కావలివారు కునికిపాట్లు పడుతుండగా మెల్లగా జైలుదాటి బయటకు వచ్చాడు. ఆ సమయంలో జైలు గోడల పక్కనేవున్న ఒక గాడిద ఓండ్రపెట్టి అరవసాగింది. పిల్లవాడి బుట్టను దించి, గభాల్న వెళ్ళి వసుదేవుడు గాడిద కాళ్లు పట్టుకుని "ఓ గార్ధభరాజా! నువ్వు అరిస్తే కావలివారు లేస్తారు. వారు లేస్తే నా ఎనిమిదో సంతతి కూడా కంసుని కత్తికి బలైపోతుంది. నా యందు దయచూపి అరవకుండా వుండు నీకు పుణ్యం వుంటుంది!" అని వేడుకున్నాడు. వసుదేవుని ప్రార్థన విన్న గాడిద అరవటం మానుకుంది.

"మామ్మా! వసుదేవుడంతటివాడు గాడిద కాళ్ళు పట్టుకున్నా డంటారు యిదేనా?" అని కొంటెకోణంగి అటడిగాడు.

"ఆ... ఈ మాట ఆనాటినుంచే వాడుక పదమైపోయింది! మన కథలో ముఖ్య పాత్ర ధారియైన శ్రీకృష్ణునికి తోడుగా, జోడుగా మసలే అన్న బలరాము డున్నాడు. ఈ బలరాముడు మహా బలశాలి, కోపిష్ఠి, తొందరపాటుతో దుందుడుకు పనులు చెయ్యటం ఆయనకు బాగా అలవాటు. బలరాముడు వసుదేవునికి రోహిణి



అనే భార్యవల్ల పుట్టిన కుమారుడు. విష్ణు అంశలో అవతారం ఎత్తిన శ్రీరామునికి లక్ష్మణుడు ఎలాంటివాడో అలాగే శ్రీకృష్ణునికి బలరాముడు అటువంటి అన్నగారు. లక్ష్మణుడు ద్వాపరయుగంలో బలరాముడు విష్ణుమూర్తి పడుకునే శేషుడు అంశతో పుట్టారని పురాణీకులు చెప్పారు. వీరిద్దరి త్రేతాయుగంలో లక్షణాలు చూస్తే అమితమైన పౌరుషం, కోపం, పట్టుదల, బలప్రదర్శనల్లో వీరికి వీరేసాటి! శేషుడు అంటే తెలుసుగా పాము. ఆ పాముకు వున్న గుణాలన్నీ బలరామ, లక్ష్మణులకూ వున్నాయి..." అని చెప్పుకుంటూ పోతున్న బామ్మకు అడ్డొచ్చిన పొట్టి మనవడు "బామ్మా! అసలు కథని తప్పించేసి యుగాలు, అవతార మూర్తులను, వారి పోలికలు చెప్పుకుంటూ పోతున్నావేమిటి? అసలా కంసు డెవరు? అక్క దేవకీ కుమారులను ఏడుగురినీ పుట్టగానే ప్రాణ భయంతో చంపేసాడు. సరే మరి ఎనిమిదవ వాడైన శ్రీకృష్ణుడిని చంపలేదా? ఎందుకు చంపలేదు..?" అని ఎదురు ప్రశ్నలు వేసాడు.

బామ్మ చిరునవ్వుతో "పొట్టివాడికన్నీ గట్టి సందేహాలే వస్తాయి నాయనా! కథను వదిలి నేను ఎక్కడికీ వెళ్ళటం లేదు. సందర్భం వచ్చింది గనుక యుగాల్లో అవతార పురుషులైన రామ, కృష్ణుల గురించి అవసరమైనప్పుడు వివరంగా చెప్పుకుందాము. 'ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే' అంటే ధర్మం నశించినప్పుడు దానిని సంరక్షించడం కోసం విష్ణుమూర్తి అనేక రకాలైన అవతారాలు ఎత్తుతుం టాను అని ఆయనే చెప్పుకున్నాడు. అంతకు ముందు ఎత్తిన అవతారాలన్నీ ఒక ఎత్తు, ద్వాపరంలో కృష్ణుని అవతారమెత్తి సకల పరిపూర్ణుడైన ఆనాటి మానవునికి మానవ ధర్మాలు గురించి చెప్పడం మరొక ఎత్తు! అటువంటి ఉత్తమ అవతారునిగా జన్మించిన శ్రీకృష్ణుని చంపటానికి దుర్మార్గుడైన కంసునివల్ల నేమవుతుంది నాయనా?"

"మరేమయ్యాడు శ్రీకృష్ణుడు?" అనడిగారు కొందరు పిల్లలు.

"చెబుతా వినండి!" అంటూ అష్టమి అర్ధ రాత్రి కారాగారంలో శ్రీకృష్ణుడు జన్మించగానే వసుదేవుడు బుట్టలో పెట్టుకుని ఎవరూ చూడకుండా బైల్దేరాడని చెప్పానుగా అలా

బైల్దేరిన వసుదేవుడు జైలుపక్కనే వున్న గాడిద గండం తప్పించుకుని యమునాతీరం చేరాడు. అవతారమూర్తి కృష్ణుడు వస్తున్నాడని తెలిసి యమునానది రెండు పాయలుగా చీలి కాలిబాట నేర్పరచింది. వసుదేవుడు భగవన్నామస్మరణ చేస్తూ యమునా నదిని దాటి అవతలి ఒడ్డుకు చేరాడు. ఆవలితీరాన వున్న రేపల్లెవాడలో నందుడనే యాదవరాజు భార్య యశోదాదేవి, శ్రీకృష్ణుడు పుట్టిన క్షణంలోనే ఒక ఆడబిడ్డను కని, ఆమెకి తెలివి వచ్చి కళ్ళు తెరవకుండా వుండిపోయింది. అది గమనించిన వసుదేవుడు కృష్ణుడిని ఆమె పక్కలోపడుకోబెట్టి ఆమెకు కలిగిన ఆడపిల్లను యెత్తుకుని తట్టలో పెట్టుకుని, యమునను దాటి తెల్లారకుండా కంసుని రాజ్యంలోని కారాగారం చేరి దేవకి సరసన ఆడశిశువును పడుకోబెట్టాడు.



అప్పటివరకూ కావలివారూ, భటులూ ఏదో మత్తుమందు చల్లినట్లు నిద్రపోతూనే వున్నారు. తెల్లవారి దేవకి లేచి తన పక్కలో వున్నది ఆడపిల్లే అని గమనించి, "ఏమండీ! నాథా! నాకు కలిగిన ఎనిమిదో సంతానం నా తమ్ముని చావుకు కారకుడవుతాడనికదా ఆనాడు ఆకాశవాణి చెప్పింది! ఇప్పుడు నాకు కలిగినది ఆడశిశువుకదా. ఈ శిశువు కంసుడిని చంప గలుగుతుందంటారా?" అనడిగింది దేవకి.

"ఏమో ఎవరు చెప్పగలరు దేవీ! కాలం ఖర్మం కలిసొస్తే ఈ ఆడపిల్లే మహాకాళిగా రూపు దాల్చవచ్చు!" అని వసుదేవుడు ఆమెకు లేనిపోని సందేహాన్ని కల్పించాడు.

తెల్లవారేసరికి నారదుడు కంసరాజ్యం చేరి 'నారాయణ' నామస్మరణ చేసుకుంటూ కంసుని కోటకు చేరాడు. కోట గుమ్మంలో అడ్డుకున్న కాపలాదారులు "ఎవరయ్యా బాబూ! తెల్లారే ప్పటికి 'నారాయణ-నారాయణ' అంటూ వచ్చావు?" అనడిగారు.

"కోటలో కంసు డున్నాడా నాయనా! నా పేరు నారదు డంటారు! వైకుంఠాన్ని వదిలి వచ్చేసాడు నారాయణుడు. ఆయన్ను వెతు క్కుంటూ నే నొచ్చాను!" అన్నాడు త్రిలోక సంచారి అయిన నారదుడు.

"కోటలో కంసమహారాజు వున్నారు! ఇంకా వారు నిద్ర లేవలేదు! మా కోటలో నారాయ



ణుడు ఎవ్వరూలేరు!" అన్నారు కావలివారు.

"నారాయణుడు కంసుని కోటలోకే వచ్చినట్లు నాకు తెలిసింది. ఆయన రాక విషయం మీ రాజు కంసునితో హెచ్చరించి వెళతాను." నారదుడు అనగానే ఆయన్ను లోపలికి పోనిచ్చారు కాపలాదారులు. సరాసరి కంసుని విశ్రాంతి మందిరానికి వెళ్లిన నారదుడు, "నారాయణ! నారాయణ! కంసరాజా! నారాయణుడు నీ కోటలో ప్రవేశించాడు. ఇంకా నిద్రపోతూ వుంటే ఆయన నీకు శాశ్వతమైన నిద్ర కల్పిస్తాడు. మత్తు వదలి నీ ప్రాణాలు నువ్వు జాగ్రత్త చేసుకోవాలి!" అని హెచ్చరించాడు నారద మహర్షి

ఆ మాటలకు విరగబడి నవ్విన కంసుడు "నారదా! నా ప్రాణాలకు రక్షణ ఏనాడో కల్పించుకున్నాను! అందుకు అవసరమైన మా అక్కబావలను చెరసాలలో వుంచాను. పుట్టీ పుట్టగానే వారి ఏడుగురి బిడ్డలను చంపేసాను" అన్నాడు.

"మీ అక్కా బావలు దైవాంశ సంభూతులు, కారణజన్ములు. వారికి కలిగే ఎనిమిదో సంతతి వల్ల నీ ప్రాణగండం తప్పదు. సాక్షాత్తు నారాయణుడే వారి గర్భాన జన్మించడానికి వైకుంఠం వదిలి వచ్చాడని నా కనిపిస్తోంది. ఆయన కోసమే నేను యిక్కడకు వచ్చాను రాక్షసరాజా! నిన్న అష్టమిరోజు, నీకు ప్రాణగండం అష్టమి సంతానంవల్ల నిన్ననే నారాయణుడు వైకుంఠాన్ని వదిలాడు... ఇవన్నీ చూస్తే నాకు చాలా అనుమానంగా వుండి తెల్లారేసరికి నీ దగ్గరకొచ్చాను. నా మాట నేను చెప్పాను. ఆ తర్వాత నీ యిష్టం!" అని చెప్పి కంసుని గుండెల్లో దడపుట్టించి నారదుడు వెళ్లిపోయాడు. వెంటనే భటుల్ని పిల్చి "నా చెల్లెలికి ఎనిమిదో సంతానం కలిగిందో లేదో చూసి వచ్చి చెప్పండి" అని ఆజ్ఞాపించాడు కంసుడు.

భటులు కారాగారంలో దేవకీ, వసుదేవుల వద్దకు వెళ్ళి చూడగా వారికి అష్టమ గర్భంలో ఆడపిల్ల కలిగినట్లు తెలిసింది. ఆడపిల్లను తీసుకురావడానికి సంశయించిన భటులు కంసునివద్దకు వెళ్ళి, "మహారాజా! దేవకీ వసుదేవులకు ఆడపిల్ల పుట్టింది!" అని చెప్పారు. ఆ వార్త వినగానే రాజు ఆశ్చర్యచకితుడైనాడు.

అష్టమగర్భంవల్ల నాకు ప్రాణగండం అని



మంచిరోజులంటూ ఉండవు. మనం చేసే పనులనుబట్టే అవి వుంటాయి.

చెప్పారు. ఆడపిల్ల నన్ను చంపడమా! దుర్లభం.. ఈ పిల్లవల్ల నాకేమీ ప్రమాదం రాదు" అని తనలో తనే సంతోషపడుతున్న సమయంలో అంతరాత్మ 'ఆడబిడ్డ అయినా, మగబిడ్డ అయినా ఎనిమిదో సంతానంవల్ల నీకు ప్రాణహాని తప్పదు!" అని ఏ మూలనుంచో ఘోషించింది.

"శత్రుశేషం వుంచకూడదన్న ధృఢ నిర్ణయంతో కంసుడు వెంటనే తన పరివారంతో సహా బైల్దేరి కారాగారం వద్దకు వెళ్ళి "ఏమయ్యా వసుదేవా? నీ ఏడుగురి పిల్లల్ని పుట్టగానే తీసుకొచ్చి నాకు అప్పగించావు. ఈ ఎనిమిదో సంతానాన్ని ఎందుకు తీసుకు రాలేదు?" అని గద్దించాడు.

"ఆడపిల్లగదా రాజా! ఈ ఆడబిడ్డవల్ల నీకు ప్రాణభయం ఏముంది రాజా!" అన్నాడు వసుదేవుడు.

"ప్రాణం తియ్యడానికి ఆడా, మగా భేదం లేదయ్యా! మీ అష్టమ గర్భంతో నాకు ప్రాణ గండం వుందని ఆకాశవాణి చెప్పిన మాటలు అబద్ధాలు ఎందుకవుతాయి? ఈ సంతతిని కూడా నా కత్తికి బలిచేసి మీ దంపతులిద్దరూ కారాగారం నుంచి విముక్తిపొందండి." అంటూ కంసుడు దేవకి బిడ్డను బలవంతంగా జైలు గదినుంచి బైటకు తీసుకువచ్చి కత్తితో నరక బోయిన రాక్షసరాజు కత్తి ఎత్తాడు. అందరూ చూస్తూండగానే ఆ ఆడపిల్ల కంసుని కత్తివేటు నుంచి తప్పించుకుని పైకెగిరి.....

"నువ్వు నన్ను చంపలేవు రాక్షసరాజా! నేను



దైవమాయను... నీ ప్రాణం తీసే దేవకీ, వసుదేవుల అష్టమగర్భాన జన్మించిన మగపిల్లవాడు వేరొకచోట క్షేమంగా పెరుగుతున్నాడు. ఆ అవతారపురుషుడు వస్తాడు. నిన్ను చంపుతాడు....!" అంటూ మాయగా పుట్టిన ఆ బిడ్డ ఆకాశానికి ఎగిరిపోయింది! ఆమె మాటలు విన్న కంసుడికి ప్రాణభీతి పట్టుకుంది. అతని పరివారమంతా గుసగుసలు మొదలెట్టారు.

"నా ఎదురకుగా నుంచిని గుసగుస లేమిటి? మీకు బుద్ధుందా లేదా? నా రాజ్యంలో నెల లోపు పుట్టిన ఆడపిల్లలైనా, మగపిల్లలైనా పట్టి తెచ్చి నా కళ్ళముందు చంపెయ్యండి!" అని రాక్షసరాజైన కంసుడు తన పరివారానికి ఆజ్ఞలు

ఏ పనీ సులువుకాదు. ఇష్టమైన పని లభిస్తే మూర్ఖుడుసైతం చేయగలడు

జారీచేశాడు. కంసుని మాటలు విన్న పరివార మంతా ఆశ్చర్యంతో తెల్లబోయి చూస్తున్నారు.

"ఏమిటి అలా చూస్తున్నారు వెళ్ళండి! మీలో ఎవరికైనా నెలలోపల పిల్లలువుంటే వారికి కూడా ఈ శిక్ష తప్పదు...!" అని హెచ్చరించాడు కంసుడు. మారు మాట్లాడలేక వెళ్ళి పోయారు పరివారం అంతా! కంసుని ఆజ్ఞను సైనికులు, భటులు, పరిచారికలతో సహా పాటిస్తున్నారు. నగరంలోనే కాకుండా యితర వూళ్ళలో గూడా నెలలోపు పసిపిల్లల్ని వెతికి తీసుకువచ్చి కంసుని కళ్ళముందు చంపేస్తున్నారు. ఈ దారుణ హత్యలకు రాజ్యంలో వున్న పసిపిల్లల తల్లులు, తండ్రులూ ఆ కంసుడిని శాపనార్థాలు పెట్టి ఏడుస్తూ వారి పసిపిల్లలను అప్పగించేస్తున్నారు." అని చెప్పటం ఆపిన బామ్మ....

"ఇంతకీ ఈ కథ చెప్పటానికి కారణం ఏమిటంటే... అవతారపురుషుడైన శ్రీకృష్ణుడు పాండురాజుకి భీముడు, ధృతరాష్ట్రునికి దుర్యోధనుడు పుట్టిన నెల గడిచిన తర్వాత, వారిద్దరి కంటే ఒక నెల చిన్నవాడుగా శ్రీకృష్ణుడు పుట్టాడు. రేపల్లెవాడలో నందుని యింట, యశోదవద్ద కృష్ణుడు బాల్యంలో తన లీలలు చూపిస్తూ పెరుగుతున్నాడు. శతశృంగ పర్వతం మీద పాండురాజు ఆశ్రమంలో కుంతి మూడవ గర్భం పది నెలలు మోసింది!..." అనగానే కొంటె మనవడు....

"మామ్మా! కృష్ణలీలలు గురించి పూర్తిగా చెప్పకుండా శతశృంగ పర్వతం మీదకు కథను ఎక్కించావేమిటి?" అని అడిగాడు.

"నాయనా కృష్ణలీలలు గురించి పూర్తిగా చెప్పాలంటే భారతంకన్నా పెద్ద కథ అయిపోతుంది.... అందువల్ల అవసరమైనప్పుడు చెబుతాను.

(ఇంకా వుంది)





ఎవరో వచ్చి నిన్ను ఆదరిస్తారని చూడకు నీయంతట నీవే ప్రయత్నించు



# కూడబెట్టకు! సంతోషం పంచిపెట్టు!

కృష్ణ మామయ్య దగ్గరకి ఏడ్చుకుంటూ వచ్చేడు. నాని, ఏడ్చి ఏడ్చి వాడి కళ్ళు వుబ్బి వున్నాయి.

నా డబ్బులు తెలుగు వాచకంలో పెట్టు కొంటే, ఎవరో తీసేసారు..." ఏడుస్తూ చెప్పాడు నాని.

కృష్ణ మామయ్య చిన్నగా నవ్వేడు. గత కొద్ది నెలలుగా గమనిస్తూ వున్నాడతను. పెద్దవాళ్ళు పిల్లలకి ముద్దుకోసమో, పని చెయ్యటానికి లంచంగానో, పుట్టిన రోజుల సందర్భంగానో, డబ్బులు పిల్లల చేతికి పెద్దలు ఇవ్వడం కృష్ణ మామయ్యకి బాధ అనిపిస్తోంది.

పిల్లల గురించి చేసే ప్రతిపని, ఆడే ప్రతి మాటా చాలా జాగ్రత్తగా చెయ్యాలి. అప్పుడే పిల్లలు చక్కటి బుద్ధిమంతులుగా పెరిగే అవకాశం వుంటుందని కృష్ణమామయ్య ఆలోచన.

"పిల్లలకి యిచ్చే డబ్బులు, వాటిని అనవసరపు ఖర్చులు పెట్టడమో, వ్యసనాల వైపు పిల్లలు వ్యామోహపడడం, పారేసుకుని ఏడవటమో, దెబ్బలాడుకొంటూ సమయాన్ని, స్నేహాన్ని దుర్వినియోగం చేసుకుంటున్నారని అతని బాధ.

"నేను కనుక్కొంటాను! ఆ దొంగల్ని శిక్షిస్తాను నానీ! ఏడవకు" అంటూ హామీ ఇచ్చేడు కృష్ణ మామయ్య.

ఆ మాత్రానికే సంతోషించేడు నాని.

"అవున్రా! ఆ డబ్బులు నీకెక్కడివి?" ఏమీ తెలియనట్లు అడిగేడు కృష్ణమామయ్య.

"విజయనగరం పిన్ని యిచ్చింది!" ఏడుపు ఆపుతూ చెప్పాడు నాని.

"ఎందుకిచ్చింది?" అడిగేడు మామయ్య

"ఉట్టినే యిచ్చింది మామా! ఊరికి వెళుతూ మా ముగ్గురికీ తలో అయిదురూపాయలిచ్చింది.

మేకల మదన్‌మోహనరావు మిర్యాలగూడెం

వాళ్ళేమో దాచుకొన్నారు. నాదే పోయింది!"

"ఆ డబ్బులతో నువ్వు ఏం చేద్దామను కున్నావు?"

"బిళ్ళలు కొనుక్కొందామనుకున్నాను."

"ఆహా? అప్పుడు ఆ రూపాయలు ఎవరి దగ్గరికి వెడతాయి?"

"హి..!" అంటూ నాని నవ్వేడు. "ఆ రూపా యలు శెట్టి కొట్టికి చేరతాయి. ఈ మాత్రం కూడా నీకు తెలియదా? అన్నట్టు మామయ్యని చూస్తూ చెప్పాడు నాని.

"సరే! ఆ బిళ్ళలు ఎక్కడికి చేరతాయి?"

కృష్ణమామయ్య ప్రశ్న, నానికి బోధపడలేదు. మౌనంగా నిల్చున్నాడు. "ఆ బిళ్ళలు నీ బొజ్జలోకి వెడతాయి! అవునా??" నాని బొజ్జమీద చూపుడు వేలుతో నొక్కుతూ మామయ్యే తన ప్రశ్నకు జవాబు చెప్పాడు.

"అవును" అన్నట్టు తల వూపేడు నాని.

"మరి ఆ బొజ్జలో బిళ్ళలు మర్నాటికి ఎక్క దుంటాయి?" అమాయకంగా అడిగేడు కృష్ణ మామయ్య.

కిసుక్కున నవ్వేడు నాని. తిన్నది అంతా బొజ్జలో అరిగిపోతుంది. మిగిలినది, పనికిరాని వ్యర్థం బయటకు పోతుంది. ఈ మాత్రం తెలిసిన నాని నవ్వుతూ 'రెండువేళ్ళు' సైగతో చూపించాడు.

"చూశావా నానీ మరి? ఆ రూపాయలు నిన్నటి వరకూ నీ పుస్తకంలో దాచుకున్నావు. వాటిని బిళ్ళలుగా మార్చి తిన్నావు. ఆ రూపా యల్తో కొనుక్కొచ్చిన బిళ్ళలూ నీ బొజ్జలో మిగలవు అని తెలుసుగదా మరి ఎందుకు ఏడుస్తున్నావు?" నవ్వుతూ వేదాంత ధోరణినో అడిగేడు మామయ్య.

ఏదో కొంత బాధపడినట్టే వుంది నానికి.



అయినా నాని బింకం వదలకుండా "మరి నేను భద్రంగా దాచుకొన్న డబ్బులు పోతే ఏడుపు రాదేమిటి?" బుంగమూతి పెట్టి అడిగాడు

"అద్గదీ సంగతి! సమస్య అంతా ఇక్కడే వుంది.

డబ్బులు అలా దాచుకుంటూనే ఈ దొంగ తనాలు...పోవడాలు ...దోపిడీలు, వాటికోసం ప్రాణాలు తీయటం వగైరాలు జరుగుతున్నాయి. అలా దాచుకోలేదనుకో ఏ బాధావుండదు." కృష్ణమామయ్య విశదీకరించేడు.

"దాచుకోకపోతే మరేమిటి చెయ్యాలి ?" సరి అయిన ప్రశ్నే వేశాడు నాని.

కృష్ణమామయ్య బోధపరచడం మొదలు పెట్టాడు.

"ఎవరైనా అభిమానంగా ఒక అగ్గిపుల్ల వెలిగించి నీకు యివ్వడానికి ప్రయత్నిస్తే, నువ్వు ఏమి చేస్తావు? తీసుకొంటావా?"

"ఊహు! తీసుకోను."

"కారణం?"

"అది నేను తీసుకోకూడనిది. ముట్టుకుంటే చెయ్యి కాలుతుంది కూడాను."

"చక్కగా చెప్పేవు నానీ! రూపాయలు కూడా అలాంటివే. ఎవరైనా నీకు రూపాయిలు యిచ్చినా, ఇంకేవైన యిచ్చినా అవి తీసుకో కూడదు." "నేను ఎంత వద్దని చెప్పినా వినకుండా విజయనగరం పిన్నిలాంటి వాళ్ళు యిస్తే మరి నేను ఏమి చెయ్యాలి?"

"మంచి ప్రశ్నవేశావు నానీ! నువ్వు 'వద్దు' అని చెప్పినా వినకుండా ఎవరైనా యిస్తే, అమ్మనో, నాన్ననో పిలిచి వాళ్ళకి ఆ రూపాయిలు అందజెయ్యాలి. వర్షం పడితే దాన్ని ఆపలేవు కదా! వెంటనే గొడుగు వేసుకొని తడవకుండా చూస్తావు. అమ్మా, నాన్నా ఆ గొడుగులాంటి వాళ్ళు. వాళ్ళు నీ రక్షణ, నీ మంచిచెడులు చూసుకొంటారు."



"అమ్మ బిళ్ళలు కొని ఇస్తుందా?"

"చెప్పానుకదా. నీకు బిళ్ళలు అవసరమా? కాదా?? అని వేరే ఆలోచిస్తారు. మీకు ఎప్పుడేది అవసరమో ఏది అనవసరమో పెద్దలే నిర్ణయిస్తారు. మీకు నిత్యావసరాలు తప్పకుండా అందుతాయి. విలాసం కొరకు 'విషం' కావాలి అంటే యివ్వరు కదా? అలాగే పళ్ళు, పొళ్ళు పాడుచేసేవి కొనరు. ఇవ్వరు. అది నీకే మంచిది. చుక్కా చుక్కా కలిస్తే సముద్రం అవుతుంది. రూపాయి రూపాయి కలిస్తే బోల్డన్ని రూపాయలు అవుతాయి. ఆ బోల్డన్ని రూపాయలతో మీకు పనికి వచ్చే మంచి పుస్తకాలు అవసరమైన ఆట వస్తువులు వారే కొనిపెడతారు."

"అవన్నీ నాకేనా?" ఆశగా అడిగాడు నాని.

"అదే తప్పు. ఒంటిపిల్లి రాకాసిలాగ బ్రతకకూడదు. మంచి స్నేహితులు, కలిసి మెలిసి వుండాలి. మంచి పుస్తకాలు, మంచి వస్తువులు కలిసి మెలిసి సద్వినియోగం చేసుకోవాలి." అని వివరంగా చెప్పేడు కృష్ణమామయ్య.

"ఆ రూపాయలు అమ్మదగ్గర వుంచితే మాత్రం అది దాచుకోవడం కాదేమిటి?" పిల్లల దగ్గర డబ్బులు దాచుకోకూడదు అని చెప్పిన కృష్ణ మామయ్యని నాని నిలదీసి అడిగేడు.

"భలే అడిగావురా కన్నా!" మెచ్చుకొన్నాడు మామయ్య. నాని బుగ్గలు చేతులతో ముద్దుపెట్టుకొన్నాడు ప్రేమగా. "నానీ! నీ కోసం నీ దగ్గర దాచుకొంటే అది స్వార్థంతో కూడబెట్టడం అవుతుంది. అది దుఃఖాన్ని కలిగిస్తుంది అదే అందరికోసం ఒక మంచిచోటుకు చేర్చుకుంటే అది సమకూడబెట్టడం, సమకూర్చుడం అవుతుంది. అది సంతోషాన్ని యిస్తుంది." కృష్ణమామయ్య వివరంగా చెప్పేడు.

పిల్లలైనా, పెద్దలైనా 'వద్దు' అనుకొనేది దుఃఖం, కావాలనుకొనేది సంతోషం!

కృష్ణమామయ్య బోధనతో నానికి సంతోషానికి దారి కనిపించింది. "నిజమే మామయ్యా! ఇకనుంచీ నీవు చెప్పినట్లే చేస్తాను!" అన్నాడు నాని వికసించిన ముఖంతో.





గొప్ప ప్రయత్నాలు, గొప్ప ఆలోచనలన్నీ హేళనతోనే మొదలౌతాయి.



# అపాయానికి ఉపాయం!

'మధువనం' అందమైన కుందేళ్ళకు ప్రసిద్ధి. ఈ విషయం తెలిసి అనేక దూరప్రాంత వాసులు అక్కడకొచ్చి స్వేచ్ఛగా విహరిస్తున్న కుందేళ్ళను పట్టుకెళుతుండేవారు. వాటి సంఖ్య నానాటికీ తగ్గిపోసాగింది.

కుందేళ్ళ రాజు శశాంకుడు వాటిని సమావేశ పరచి, విషయం వివరించి, తన జాతి రక్షణకు కొన్ని జాగ్రత్తలు చెప్పాడు. నాటినుండి కుందేళ్ళు ఎక్కడబడితే అక్కడ అజాగ్రత్తగా తిరగడం తగ్గించాయి. ఏమాత్రం అలికిడి అయినా జాగ్రత్తపడి తప్పుకొనేవి. ఫలితంగా కుందేళ్ళు అందరికీ అందటంలేదు.

ఇలా ఉండగా మధువనానికి కొత్తగా ఓ ఆపదవచ్చిపడింది. ఒక ఏనుగుల గుంపు అక్కడి సరస్సులో జలకాలాడటానికి రావడం ప్రారంభించాయి. అలా ఏనుగులు ప్రతి రోజూరావటం వలన ఆ కొలను చుట్టుప్రక్కల ఉంటున్న కుందేళ్ళు, వాటి పిల్లలు ఆ ఏనుగుల కాళ్ళక్రింద పడి నలిగి చనిపోయేవి.

ఈ ఆపదను చూసి శశాంకుడు చాలా కలవరపడ్డాడు. ఏనుగులను ఎదిరించడమంటే కొండను ఎదిరించడమే! వాటిని ఉపాయంతో ఎదుర్కోవాలనుకున్నాడు. బాగా ఆలోచించి ఓ ఉపాయం చేసాడు. తన ఆలోచన మిత్రులకు చెప్పాడు.

మరుసటి రోజు ఏనుగులు వచ్చే వేళకు శశాంకుడు స్నేహితులతో కొలను చుట్టూరా పూలు, పళ్ళు పట్టుకుని నిల్చున్నాడు. ఇంతలో చీకటిపడే సమయం అయింది. ఏనుగులు భీకరంగా ఘీంకారాలు చేస్తూ వనంలోకి ప్రవేశించి, పొదలను నాశనం చేస్తూ, భీభత్సం సృష్టిస్తూ కొలను దగ్గరకొచ్చాయి.

డి.కె. చదువులబాబు - ప్రొద్దుటూరు

అక్కడ పూలు, పండ్లతో నిల్చున్నవారిని విచిత్రంగా చూశాయి. శశాంకుడు శాంతంగా ఏనుగుల వైపు చూసి, "ఎవరు మీరు?" అన్నాడు.

ఏనుగులరాజు, "మా సంగతే తెలియదా నీకు? ఈ అడవికి రాజులం. ఈ ప్రాంతమంతా మాదే. నా పేరు వీరగజం" అంది.

ఆ మాటవిని శశాంకుడు జాలిగా ముఖం పెట్టి, "అయ్యో! వీరగజం అంటే మీరేనా? నిన్న రాత్రి కలలో మా రాజు కనిపించి మీరు అక్రమంగా ఈ వనంలోకి ప్రవేశించి భీభత్సం సృష్టిస్తున్నారని, మీ కాళ్ళక్రింద పడి అనేక కుందేళ్ళు మరణిస్తున్నాయనీ, అందుకు శిక్షగా మిమ్మల్ని వజ్రాయుధంతో బంధించాలనీ, తాను వస్తున్నానని చెప్పారు! ఆయన కోసమే మేము ఇక్కడున్నాం" అన్నాడు.

వీరగజం కోపంగా చూసి, "ఏడీ మీ రాజు? ఎక్కడున్నాడు?" అని అడిగాడు.

"మా రాజు ఇంద్రుడి కొలువులో వుంటాడు. మరికాసేపటిలో ఈ కొలనులోకి వస్తాడు" అన్నాడు శశాంకుడు.

ఆ రోజు పౌర్ణమి, మరికాసేపటికి నిండ చంద్రుడు ఆకాశంలోకి రాగానే, ఆ ప్రతిబింబం కొలనులోని నీటిలో పడింది. ఉదయించే చంద్రుడు ఎప్పుడూ ఎర్రగా వుంటాడు. ఆ ఎర్రటి చంద్రుణ్ణి శశాంకుడు, వీరగజానికి చూపించి, "ఓ ఏనుగుల రాజా! మీమీద ఆగ్రహంతో మా రాజు ఎలా మండిపోతున్నాడో చూడు. తన వజ్రాయుధంతో ఈ క్షణమే మిమ్మల్ని బంధించగలడు." అన్నాడు.

శశాంకుడి మాటలు విని ఉదయించే ఆ ఎర్రటి చంద్రుడి ప్రతిబింబాన్ని చూసిన వీరగజానికి శశాంకుడు చెప్పింది నిజమే అనిపించి భయంవేసింది. ఆ కుందేళ్ళ రాజు తన వజ్రాయుధంతో ఏనుగుల జాతిని బంధిస్తాడని భయపడింది.

అప్పుడు ఏనుగులరాజు శశాంకుడితో





శారీరక సౌందర్యం ఎంత వున్నా హృదయ సౌందర్యం లేకపోతే అదంతా దండగే

"అయ్యా! మేము ఇన్ని రోజులనుంచీ తెలియక పొరపాట్లు చేశాము. ఈ రోజు నుంచి మావలన ఎవరికీ ఏ అపకారం జరుగదు. మమ్మల్ని క్షమించమని మీ రాజుతో చెప్పి, శాంతింప జేయండి" అని వేడుకుంది.

శశాంకుడు తన ఆలోచన ఫలితమిచ్చినందుకు లోలోపల సంతోషిస్తూ, "మీరంతా దూరంగా వెళ్ళి నిలబడండి. మీ మాటలు రాజుతో చెప్పి వస్తాను" అన్నాడు.

శశాంకుడు చెప్పినట్లే ఆ ఏనుగులన్నీ కొలనుకు దూరంగా నిల్చున్నాయి.

శశాంకుడు, మిత్రులు తాము తెచ్చిన పూలు, పండ్లు కొలనులో పడేశారు.

కాసేపు గడిచిన తరువాత శశాంకుడు ఏనుగుల రాజుదగ్గరకు వెళ్ళి, "మిత్రమా! నీ మాటలు మా రాజుతో చెప్పాను. ఆయన ఒక షరతుమీద మిమ్మల్ని క్షమించడానికి అంగీకరించాడు" అన్నాడు.

"ఏమిటా షరతు?"

ఈ రోజు నుండీ మీరు మధువనానికి కాపలాగా ఉండాలి. ఈ వనంలోనికి బయట నుంచి పురుగు కూడా లోపలికి రావడానికి వీలు లేకుండా చూసే బాధ్యత మీమీద పెట్టాడు. మీ కిష్టమేనా?" అన్నాడు.

ఏనుగులరాజు గండం గడిచిందని సంతోషించి అందుకు ఒప్పుకున్నాడు.

అప్పుడు శశాంకుడు ఏనుగులరాజును మళ్ళీ సరస్సువద్దకు తీసుకువెళ్ళి చూపించాడు. మా రాజు ఎంత సంతోషంగా వున్నాడో చూడు అన్నాడు.

అప్పటికి చంద్రుడు తెల్లగా మారివుండడంతో ఎరుపుదనం లేదు. వీరగజం చంద్రుని ప్రతి బింబానికి తొండంతో నమస్కారం చేసి తన మిత్రులతో వెళ్ళిపోయింది.

ఆ విధంగా శశాంకుడి ఉపాయం వలన కుందేళ్ళకు పెద్ద ఆపద తప్పింది. ఏనుగుల కాపలావల్ల వేటగాళ్ళ భయం తప్పిపోయి సుఖంగా జీవించసాగాయి. అందుకే అంటారు ఆలోచిస్తే దేనికైనా ఉపాయం ఉంటుంది.






శ్రీకృష్ణదేవరాయల పరిపాలనలో రాజ్యం ఎంతో సుభిక్షంగా వుంది. కానీ ఇప్పుడిప్పుడే రాజ్యంలో దొంగతనాలు జరుగుతున్నాయి. రోజు రోజుకు దొంగతనాలు ఎక్కువ అవుతున్నాయి. దొంగను పట్టుకొనడం సాధ్యం కావటంలేదు. దొంగ ఎంతో చాకచక్యంగా దొంగతనాలు చేసి తప్పించుకుంటున్నాడు.

దొంగతనం చేయటంలో చిన్నపాటి ఆధారాలు లేకుండా జాగ్రత్తపడుతున్నాడు. దొంగతనా లను పరిశీలిస్తే ఆ వృత్తిలో నైపుణ్యం కలిగినవాడే చేస్తున్నట్లు పరిశీలనలో తేలింది.

దొంగలను పట్టుకొనటంలో రాజుకు సవాలుగా మారింది. వెంటనే వికటకవి తెనాలి రామకృష్ణను రమ్మని కబురు పంపారు శ్రీకృష్ణదేవరాయలు.

ఆఘమేఘాలమీద తెనాలి రామకృష్ణ వచ్చారు. "ప్రణామాలు రాజా!" నమస్కరించాడు రాజుకు వినయంగా.

"రామకృష్ణా! నా రాజ్యంలో రోజు రోజుకు దొంగతనాలు ఎక్కువ అవుతున్నాయి. దొంగలు తప్పించుకుని తిరుగుతున్నారు. దొంగలను పట్టడంలో నీవే సమర్థుడవు. దొంగలను ఎలాగైనా పట్టుకోవాలి. వాళ్ళను శిక్షించాలి" అని ఆదేశించాడు రాజు.

"తప్పకుండా దొంగను పట్టుకుంటాను" చెప్పాడు రామకృష్ణ. కానీ సైనికుల సహాయం కావాలి అడిగాడు రాజును. వెంటనే సైనికుల సహాయం తీసుకోమని చెప్పారు రాజు.

ఒక రోజు ఉదయం వాహ్యాళి (మార్నింగ్ వాక్)కు వెళ్తుతున్నాడు తెనాలి రామకృష్ణుడు తన వెంట సైనికులను తీసుకొని వెళ్లాడు.

వాహ్యాళిలో సైనికులకు ఏవో సూచనలు ఇచ్చాడు! సైనికులు తలవూపారు.

రాజ్యంలో అడుగడుగునా సైనికులను నియమించారు. కొత్తవ్యక్తి వస్తే అనుమా


పర్ల చంద్రశేఖర్ - కర్నూలు

నిస్తున్నారు. డేగవలె నిఘాను ఏర్పాటుచేశారు.

ప్రొద్దుగూకింది.. చీకటి అయింది. అర్ధరాత్రి దాటింది. పేద బ్రాహ్మణుని ఇంట్లోకి దొంగ ప్రవేశించాడు.

శ్రీ మహాభారతం, శ్రీ రామాయణం, భాగవతం పుస్తకాలు బీరువాలో కనిపించాయి. బయట పంచాంగం పుస్తకాలు కనిపించాయి. బంగారం, నగలు, ధనం కనిపించలేదు.

బ్రాహ్మణుని ఇంట్లోనుంచి దొంగ బయటికొచ్చాడు. వెంటనే సైనికులు దొంగను పట్టుకున్నారు. దొంగను తీసుకువెళ్లి జైల్లో పెట్టారు.

శ్రీకృష్ణదేవరాయలు ఆస్థానంలోకి దొంగను ప్రవేశపెట్టారు. "మహారాజా! వీడే దొంగ! ఎంతో నైపుణ్యంతో దొంగతనాలు చేస్తూ సవాలుగా నిలిచాడు. వీణ్ణి శిక్షించండి" అన్నాడు తెనాల రామకృష్ణుడు.

"ఎప్పటి నుంచి దొంగతనాలు చేస్తున్నావు? ఎందుకు చేస్తున్నావు?" ప్రశ్నించారు శ్రీకృష్ణదేవరాయలు.

"నా పేరు రాముడు. ఐదేళ్ళ నుంచి దొంగతనం చేస్తున్నాను. నాకు పనిచేయడం చేతకాదు, సోమరిపోతును. నా భార్యా బిడ్డలను పోషించాలంటే సంపద కావాలి. అందుకోసం దొంగతనాన్ని వృత్తిగా ఎంచుకున్నాను. పగలంతా ఎవరింట్లో దొంగతనం చేయాలి? ఎలా తప్పించుకోవాలి, అని పరిశీలిస్తాను. రాత్రి దొంగతనంచేస్తానని." చెప్పాడు రాముడు.

"మహారాజా! వీడ్ని శిక్షించకుండా, కనువిప్పు



కలిగేలా చేద్దాం" అన్నాడు తెనాలి రామకృష్ణ.

"అలాగే చేద్దాం!" అన్నాడు రాజు.

బయటనుంచి అరవై ఏళ్ళ వయసున్న వృద్ధుణ్ణి ఆస్థానంలోకి ప్రవేశపెట్టారు.

వృద్ధుని పేరు రవి. ఇప్పటికి ఒక దుకాణంలో పనిచేస్తున్నాడు. పని చేసినందుకు రెండువందల వరహాలు జీతం ఇస్తున్నారు." చెప్పాడు తెనాలి రామకృష్ణుడు.

"ఒరేయ్ రాముడు! అరవై ఏళ్ల వయసున్న వృద్ధుడు పనిచేసి, తన కుటుంబాన్ని పోషించుకుంటున్నాడు. నీవు దొంగతనాలు చేస్తూ జీవనం కొనసాగిస్తున్నావు, సిగ్గుగా లేదు? నిన్ను శిక్షిస్తే నీ భార్యాబిడ్డల జీవితం అగమ్యగోచరంగా మారుతుంది. యువకుడివి కష్టపడి పనిచేయాలి కష్టపడితే ఫలితం లభిస్తుంది."

మళ్లీ "ఇకనుంచి పనిచేసి మీ కుటుంబాన్ని పోషించుకో..." సలహా ఇచ్చాడు తెనాలి రామకృష్ణుడు.

అందుకు శ్రీకృష్ణదేవరాయలు సమ్మతించారు.

"శభాష్! తెనాలి రామకృష్ణా!! దొంగను శిక్షించకుండా 'కనువిప్పు' కలిగేలా హితబోధ చేసావు" మెచ్చుకోలుగా అని..

వెంటనే వంద వరహాలను కానుకగా తెనాలి రామకృష్ణకు అందజేశాడు.

"ధన్యవాదాలు మహాప్రభూ!" అన్నాడు తెనాలి రామకృష్ణుడు.





మనం సుఖంగా జీవించడానికి, ఆనందంతో జీవించడానికి మధ్య తేడా చాలా వుంటుంది




తంజావూరు అనే పట్టణం వుంది. ఆ రాజ్యాన్ని రఘునాథ రాయలు అనే రాజు పరిపాలిస్తున్నాడు. ప్రజలకు దాన ధర్మాలుచేస్తూ 'దానకర్ణుడుగా' ప్రసిద్ధిగాంచాడు. ఇలా కొంత కాలం కొనసాగింది.

తంజావూరు రాజ్యంలో వర్షాలు కురవటం లేదు. తీవ్ర దుర్భిక్షంతో కరువు ఏర్పడింది. పొలాలన్నీ బీటలువారాయి.

"అన్నమో రామచంద్రా..." అంటూ ప్రజలు ఆకలితో అల్లాడిపోతున్నారు.

వర్షాలు కురిసేందుకు దేవతలకు పూజలు చేశాడు రాజు. తమ గురువైన మంత్రాలయం శ్రీ రాఘవేంద్రస్వామిని దర్శించుకొన్నాడు రఘునాథ రాయలు.

"గురుదేవా! నా రాజ్యంలో తీవ్ర కరువు వచ్చింది. ప్రజలు ఆకలితో అలమటిస్తున్నారు... కరువు నుండి కాపాడండి. నన్ను ఆదుకోండి స్వామీ" అంటూ రాజు మొరపెట్టుకున్నాడు.

శ్రీ రాఘవేంద్రస్వామి దివ్యదృష్టితో చూశారు.

"మహారాజా! నీవు బ్రాహ్మణునికి భిక్షపెట్ట లేదు. అతను ఆకలితో నిన్ను, రాజ్యాన్ని శపించాడు. అందువల్లనే కరువు ఏర్పడింది." చెప్పారు గురుదేవులు.

బ్రాహ్మణుని శాపం నుంచి విముక్తి అయ్యేందుకు ఉపాయం చెప్పండి స్వామీ అన్నాడు రాజు.

శ్రీ రాఘవేంద్రస్వామి కళ్లు మూసుకుని దివ్యదృష్టితో ఆలోచించాడు.

"రాజా! వేదపండితులతో వరుణయాగం చేయించండి. ముందుగా ప్రజలందరికీ అన్నదానం చేయండి" అన్నాడు గురుదేవులు.

"అలాగే చేస్తాను గురుదేవా!" చెప్పాడు రఘునాథరాయలు.

"నాకు సెలవు ఇవ్వండి" అడిగాడు రాజు.

"మా సలహా పాటించండి" చెప్పి దీవించాడు గురుదేవులు.

పర్ల చంద్రశేఖర్ - కర్నూలు

తంజావూరు రాజ్యానికి వెళ్లాడు రాజు. వేద పండితులందర్నీ ఆహ్వానించాడు.

"వేదపండితులారా! వరుణ యాగం చేయటానికి శుభముహూర్తం చూడండి." సలహా ఇచ్చాడు రఘునాథరాయలు.

పంచాంగాలను పరిశీలించారు వేద పండితులు శ్రావణ మాసం బహుళ దశమి, ఏకాదశి శుభ దినాలని చెప్పారు.

వరుణయాగం చేసేందుకు ఏర్పాట్లు చేయండి ఆదేశించాడు రఘునాథరాయలు.

శ్రావణ మాసం బహుళ దశమి వచ్చింది. వరుణయాగం చేయటానికి కావలసిన ఏర్పాట్లు చేశారు వేదపండితులు.

"వరుణదేవా! నన్ను క్షమించండి.. వర్షం కోసం యాగం చేస్తున్నాను" అని రాజు వేడుకున్నాడు. వేదమంత్రాలతో వరుణయాగం చేశారు పండితులు.

ఆ రోజు రాత్రి ఉరుములతొ ఆకాశం గర్జించింది. వరుణదేవుడు కరుణించాడు.

కుంభవృష్టితో వర్షాలు కురిశాయి. చెరువులు, బావులు వర్షంనీటితో నిండాయి.

వర్షం కురవటంతో ప్రజలు సంతోషించారు. మరునాడు ఏకాదశి రోజున ప్రజలందరికి అన్నదానం చేశారు రాజు. పంటలు పండసాగాయి. ప్రజలందరూ సుభిక్షంతో వున్నారు

వర్షాలు కురవటంతో రాజు హర్షం వ్యక్తం చేశాడు. శ్రీరాఘవేంద్రస్వామిని రాజ్యానికి రప్పించారు. "స్వామీ! నన్ను ఆపదనుంచి ఆదుకొన్నారు. మీ రుణం ఎప్పటికీ తీర్చుకొనలేను" అని విన్నవించాడు రాజు.

"రఘునాథరాయల రాజా! ఆపదలో వున్నప్పుడు నన్ను వేడుకుంటే సహాయం చేస్తాను" అని చెప్పారు గురుదేవులు.

శ్రీ రాఘవేంద్రస్వామికి పట్టువస్త్రాలతో సన్మానించాడు రాజు.





ధనం సంపాదించడంతో నీ కృషిని ఆపవద్దు. దాయాగుణం ధర్మగుణం కూడా వుండాలి



# ౨౦ ఏళ్ళ తర్వాత !

ఆ పోలీసు గంభీరంగా రోడ్డు వెంట చకచకా నడుస్తున్నాడు. అది రాత్రి 10 గంటల సమయం. చల్లటి గాలి వీస్తుంది. కొద్ది సేపట్లో వర్షం వచ్చేలా వుంది.

ఆ రోడ్డు మీద సగం దూరం వెళ్ళాక ఠక్కున నడక వేగం తగ్గించాడు. అక్కడొక షట్టర్ మూసి వున్న షాపు దగ్గర ఒక వ్యక్తి నిల్చుని వున్నాడు. ఇంకా వెలిగించని సిగరెట్ అతని నోట్లో వుంది. అతని దగ్గరకు వెళ్లాడు పోలీస్.

“ఏం లేదు సార్! నేనొక ఫ్రెండ్ కోసం ఎదురు చూస్తున్నా. అది నేను ఇరవై సంవత్సరాల క్రితం చేసిన వాగ్దానం, వింతగా అనిపిస్తుంది కదూ? వివరంగా చెప్తా. ఇరవై సంవత్సరాల క్రితం యిప్పుడీ షాపు వున్న చోట ఒక చిన్న హోటల్ వుండేది....”

“అవును ఐదు సంవత్సరాల క్రితమే దాన్ని పడగొట్టారు.” అన్నాడు పోలీస్.

ఆ వ్యక్తి అగ్గిపుల్ల గీసి సిగరెట్ వెలిగించుకున్నాడు. ఆ వెలుతురులో అతని పాలిపోయిన ముఖం, సన్నటి పెదాలు, తీక్షణమైన కళ్ళు కనిపించాయి. అతడి కుడి కనుబొమ్మ దగ్గర ఒక గాయపు మచ్చ వుంది. అతని టై-పిన్‌లో ఒక డైమండ్ వుంది.

“ఇరవై సంవత్సరాల క్రితం ఒక రాత్రి నా ప్రియమిత్రుడైన జిమ్మివెల్స్‌తో యిక్కడే డిన్నర్ చేసాను. అతడు, నేను యిక్కడే... ఈ న్యూయార్క్ నగరంలోనే అన్నదమ్ముల్లా పెరిగాము. అప్పుడు నాకు పద్దెనిమిది సంవత్సరాలు జిమ్మీకి ఇరవై. ఆ మర్నాడే నేను డబ్బు సంపాదించడానికి పడమర దేశాలకు వెళ్ళబోతున్నాను.

“జిమ్మి న్యూయార్క్ వదిలిపెట్టి ఎక్కడికీ వెళ్ళడు. ఎందుకంటే అతని దృష్టిలో న్యూయార్క్ యీ భూమి మీద వున్న మంచి ప్రదేశం. ఆ రోజుకు, ఆ టైముకు సరిగ్గా ఇరవై సంవత్సరాల

పర్ల చంద్రశేఖర్ - కర్నూలు



తర్వాత యిక్కడే కలుసుకుందామని యిద్దరం బాస చేసుకున్నాము."

"చాలా ఆసక్తికరంగా వుంది. ఇద్దరూ కలిసి చానాళ్ళయింది కదూ. నువ్విక్కడినుంచి వెళ్లి పోయినప్పటినుంచీ మీ మిత్రుని గురించి ఏమీ వినలేదా?" అన్నాడు పోలీసు.

"కొంత కాలం యిద్దరం ఉత్తరాలు రాసుకునేవాళ్ళం. కానీ ఒకటి, రెండు సంవత్సరాల తర్వాత మానేసాము. ఈ ప్రపంచంలో జిమ్మి నిజమైన ప్రేమించదగిన వ్యక్తి. అతడు బ్రతికి వుంటే మాత్రం తప్పక వస్తాడు అని నాకు తెలుసు. అతడు మరిచిపోడు. ఇక్కడ ఈ రాత్రి పూట నిల్చోవడానికి వెయ్యి మైళ్ళ దూరం నుంచి వచ్చాను. నా ఫ్రెండ్‌ను చూడటం ముందు అదో లెక్కలోది కాదు" అన్నాడా వ్యక్తి.

అలా అంటూ ఆ వ్యక్తి తన పాకెట్ వాచ్ బయటికి తీసాడు. దాని మూత చిన్న చిన్న డైమండ్స్‌తో మెరుస్తుంది. "పది కావటానికి ఇంకా మూడు నిముషాలుంది. నాకు అతడు గుడ్‌బై చెప్పింది సరిగ్గా పది గంటలకు" అన్నాడు.

"పడమటి దేశాలలో వెళ్ళి బాగా సంపాదించినట్టుంది కదూ?" అన్నాడు పోలీస్.

"అవును. కానీ జిమ్మి నా అంత సంపాదించి వుండదు. అతడు చాలా స్లో. డబ్బు సంపాదించడానికి చాలా కష్టపడ్డాను" అన్నాడు.

ఆ పోలీసాయన లాఠీ వూపుతూ ఒకటి, రెండు అడుగులు వేసి, "నేను నా పనిమీద వెళ్తున్నా. మీ మిత్రుడు తప్పక వస్తాడని ఆశిస్తా. అతని కోసం యింకా కొంచెం సేపు వెయిట్ చేస్తారా?" అన్నాడు.

పోలీసు కూడా "గుడ్ నైట్ సర్" అని లాఠీ ఊపుకుంటూ ముందుకు సాగాడు.

అప్పటికల్లా గాలి వేగం పెరిగింది. వర్షం మొదలైంది. రోడ్డు మీద నడుస్తున్న వాళ్ళు కోట్ కాలర్లు పైకెత్తి, జేబులో చేతులు పెట్టుకుని అటూ ఇటూ పరుగులు తీయసాగారు.

వెయ్యి మైళ్ళ దూరం నుంచి వచ్చిన ఆ వ్యక్తి సిగరెట్ తాగుతూ తన మిత్రుని కోసం అలాగే నిల్చుని వున్నాడు. అలా దాదాపు 20 నిమిషాలు వేచివున్నాడు.

అప్పుడొక పొడవాటి వ్యక్తి, తన ఓవర్‌కోటు కాలరు పైకి ఎత్తిపెట్టి, రోడ్డుకు ఆ పక్కనుంచి యీ పక్కకు వచ్చాడు. అతడు సరాసరి ఆ ఎదురు చూస్తూన్న వ్యక్తి దగ్గరకి వెళ్లాడు.



"మీరు బాబ్ కదూ?" అన్నాడు సందేహంగా.

"నువ్వు జిమ్మి వెల్స్ కదూ?" అని సంతోషంగా అరిచాడా వ్యక్తి.

అవతలి వ్యక్తి రెండు చేతులు తన చేతులతో పట్టుకుని, "అవును. నువ్వు బాబ్‌వే. నువ్వు బతికుంటే తప్పక కలుస్తావని నాకు తెలుసు. వెల్. ఇరవై సంవత్సరాలంటే చాలా ఎక్కువ కాలమే. వెస్ట్ కంట్రీస్‌లో మీ జీవితం ఎలా వుండేది?" అన్నాడు.

"ఫైన్. నేనడిగిందల్లా యిచ్చింది. కానీ జిమ్మి నువ్వు చాలా మారిపోయావు. నువ్వింత పొడుగుంటావనుకోలేదు."

"అవును, కొద్దిగా పొడుగయ్యాను. నేను యిక్కడే ఒక సిటీ డిపార్ట్‌మెంట్‌లో పనిచేస్తున్నా! అలా వెళ్దాం పద నాకు బాగా తెలిసిన ఒక మంచి చోటుకు తీసుకెళ్తా. నడు పాతరోజుల గురించి మాట్లాడుకుందాం."

ఇద్దరూ చేతిలో చెయ్యి వేసుకుని ముందుకు నడిచారు. వెస్ట్‌నుంచి బాగా సంపాదించి వచ్చిన ఆ వ్యక్తి తన సాహస గాథల గురించి వర్ణించి చెప్పసాగాడు. కోటుతో బాగా కప్పుకున్న ఆ వ్యక్తి శ్రద్ధగా వింటున్నాడు.

మూల మలుపు దగ్గర ఒక కెమిస్ట్ షాపుంది. అది ఎలక్ట్రిక్ లైట్లతో వెలిగిపోతుంది. అక్కడికి రాగానే యిద్దరూ ఆతృతగా ఒకరి ముఖంలోకి ఒకరు చూసుకున్నారు.

వెస్ట్ నించి వచ్చిన వ్యక్తి టక్కున ఆగి తన చెయ్యి విడిపించుకుని, "నువ్వు జిమ్మీ వెల్స్ కాదు.

ఇరవై సంవత్సరాలు చాలా ఎక్కువ కాలమే కాని ఒక మనిషి ముక్కును మార్చలేదు" అన్నాడు.

అందుకా పొడవాటి వ్యక్తి, "కాలం ఒకసారి మంచివాణ్ణి చెడ్డవాడుగా మారుస్తుంది. మిస్టర్ బాబ్, నువ్వు పది నిమిషాల క్రితం నుంచి అరెస్ట్‌లో వున్నావు. నువ్వు న్యూయార్క్‌కు వచ్చి వుంటా వనుకుని షికాగో పోలీసులు నిన్ను అరెస్ట్ చెయ్యమని మాకు టెలిగ్రాం పంపించారు. వాళ్లు నిన్ను కొన్ని ప్రశ్నలు అడగాలట. మనం పోలీస్ స్టేషన్‌కు వెళ్ళటానికి ముందు యీ ఉత్తరం, ఆ వెలుతురులో చదువుకో. ఇది జిమ్మీ వెల్స్ అనే పోలీస్ మ్యాన్‌ది" అంటూ ఒక ఉత్తరం అందించాడు.

వెస్ట్ నించి వచ్చినతను ఆ కాగితం మడత విప్పి, గట్టిగా పట్టుకుని చదవసాగాడు. కానీ చదువుతున్న కొద్దీ అతని చేతులు వణక సాగాయి. అదొక చిన్న లేఖ. అందులో యిలా వుంది...

"బాబ్, నిన్ను కలవటానికి నేను సరియైన టైంకే వచ్చాను. నువ్వు సిగరెట్ ముట్టింతు కోవటానికి అగ్గిపుల్ల వెలిగించినప్పుడు నీ ముఖం చూశాను. అది ఒక దోపిడీ కేసులో షికాగో పోలీసులు అరెస్ట్ చెయ్యాలని చూస్తున్న వ్యక్తి ముఖం అని వెంటనే అర్థమయింది. కానీ నేనాపని చేయలేకపోయాను. అందుకే నేను స్టేషన్‌కు వెళ్ళి నిన్ను అరెస్ట్ చేయడానికి ఒక డిటెక్టివ్‌ను పంపించాను.

- జిమ్మీ వెల్స్.





ఆపదలోనూ, బాధల్లోనూ వున్నవారి మనసును తెలుసుకొని సహాయపడే వాడే నిజమైన స్నేహితుడు



# సంసార జీవితం-ఆధ్యాత్మిక పురోగతి !

కబీరు మహాభక్తుడు. నిరంతరం రామనామ స్మరణ చేస్తూ, తన పనిని తాను చేస్తూ ఉండేవాడు. ఒక దినము, ఒక సాధకుడు అతని వద్దకు వచ్చాడు. "స్వామీ! గృహస్త జీవితం గడుపుతూ ఆధ్యాత్మిక పురోగతి సాధించగలమా?" అని ప్రశ్నించాడు. కబీరు సూటిగా వెంటనే సమాధానం చెప్పలేదు.

కబీరు అప్పుడు మంచంమీద ఏదో వస్త్రం నేస్తున్నాడు. దారం ఒకటి తెగింది. అతడు వెంటనే భార్యను పిలిచి, "దీపం వెలిగించి తీసుకురా" అన్నాడు. అది పట్టపగలు. లోపల కూడా బాగా వెల్తురుగానే వుంది. అయినప్పటికీ కబీరు భార్య దీపం వెలిగించి తెచ్చి అక్కడ పెట్టింది. ఆ వెల్తురులో తెగిపోయిన దారమును సరిజేసి, "ఈ దీపాన్ని తీసుకొని వెళ్ళు" అన్నాడు. ఆమె అదే విధంగా దీపమును తీసుకొని లోపలికి వెళ్ళిపోయింది.

కబీరు తనను ప్రశ్నించిన సాధకుని చూసి, "నాయనా! చాలామంది సంసార జీవితం ఆధ్యాత్మిక జీవితానికి అడ్డు తగులుతుంది- అని అనుకుంటారు. ఇది చాలా పొరపాటు! తన ధర్మమును గుర్తించి నడిచే భార్య వుంటే సంసార జీవితం ఆధ్యాత్మిక పురోగతికి సహాయం చేస్తుంది. మీరే చూచారు కదా! పట్టపగలు దీపం వెలిగించి తీసుకురా అని అన్నప్పుడు ఎందుకు అని ఆమె ప్రశ్నించలేదు. తీసుకురా అంటే తెచ్చింది. తీసుకుని వెళ్ళు అంటే వెళ్ళింది. ఈ విధంగా భర్తతో సహకరించే భార్య వుంటే సాధకుడు సంసార జీవితంలోనే ఆధ్యాత్మిక పురోగతిని సాధించవచ్చు" అని తెలియజేసాడు.

కబీర్‌దాస్ యొక్క సూక్తిని కూడా మననం చేయటం మంచిది. "హాథ్ మే కామ్, దిల్ మే రామ్!" చేతితో పని హృదయంలో రామనామము చెయ్యి."

(ఈ కథ భగవాన్ శ్రీ సత్యసాయిబాబా వారి దివ్యోపన్యాసాలనుండి స్వీకరించబడినది)

వి. మోహిని - చెన్నై




సరయూ నది ఒడ్డున కేశవనాథుడు అనే గురువు ఆశ్రమం నడుపుతుండేవాడు. ఎంతో మంది శిష్యులు ఆయన వద్ద శిష్యరికం చేసి విద్య నేర్చుకుంటూ వుండేవారు. కొన్నాళ్ళకి కేశవనాథుడికి వృద్ధాప్యం సమీపించింది. ఒక రోజు గురువు శిష్యుల నందరినీ సమావేశపరచి "నాయనలారా! నాకు చూస్తే వృద్ధాప్యం వచ్చేసింది. వయసు పెరిగేదే కాని తరిగేది కాదు. ఈ వయస్సులో నా కిక శక్తి సన్నగిల్లిపోతున్నది. కాబట్టి మీలో ఒకర్ని నా వారసునిగా నియమించి, నేను తపోః సాధనకు వెళ్ళిపోతాను. నాలో వున్న విద్యనంతా మీకు బోధించి యున్నాను" అంటూ శిష్యుల వైపు పరిశీలనగా చూసి అప్పుడు గురువు, "నాయనా! మీకేదైనా సమస్య ఎదురైతే దానిని మీరు వెంటనే పరిష్కరిస్తారా? నిదానంగా పరిష్కరిస్తారా?" అని ప్రశ్నించాడు.

ఓ శిష్యుడు లేచి "వెంటనే పరిష్కరిస్తాను!" అన్నాడు.

దాన్ని సమర్థిస్తూ కొంత మంది శిష్యులు– "అవును! వెంటనే పరిష్కరించడమే మంచిది. దానివల్ల త్వరగా సమస్య నివృత్తి అవటమే గాకుండా, మరో సమస్యనయినా ఎదుర్కొను టకు సిద్ధంగా వుండవచ్చు! 'ఆలస్యం అమృతం విషం' కాబట్టి ఎప్పటి సమస్యల నప్పుడే కాలయాపన లేకుండా పరిష్కరించాలి!" అన్నారు.

ఇక మిగిలిన శిష్యులు ఇలా అన్నారు.

"గురువర్యా! సమస్యని నిదానంగానే పరిష్క



చంద్రగిరి కృష్ణ – యర్నగూడెం

రించాలి! వెంటనే పరిష్కరించినయెడల దాని నుండి క్రొత్త సమస్యలు పుట్టవచ్చు. 'నిదానమే ప్రధానం' కాబట్టి నిదానంగా పరిష్కరించుటయే మంచిది.

కానీ అపేక్షశర్మ అనే శిష్యుడు మాత్రం మౌనంగా వున్నాడు.

కేశవనాథుడు చిరునవ్వుతో అపేక్షశర్మ వైపు 'నీ సమాధాన మేమిటి?' అన్నట్లు చూశాడు.

అపుడు అపేక్షశర్మ శాంతగంభీరంగా యిలా అన్నాడు–

"ఆచార్యా! ఎప్పుడో వచ్చే సమస్య గురించి ఇప్పుడు చెప్పడం అసందర్భంగా వుంటుంది. ఎందుకంటే, ఒక సమస్య యొక్క స్వభావాన్ని బట్టి మాత్రమే వెంటనేగానీ, నిదానంగాగానీ పరిష్కరించాలి. కొన్ని సమస్యలను నిదానంగా పరిష్కరించడం కుదరదు. అలాగే మీమాంసతో కూడిన సమస్యలను వెంటనే నివృత్తి చేయ లేము. ఎదురైన సమస్యను నిశితంగా పరిశీలించి దాని స్వభావరీత్యా మాత్రమే దాన్ని ఏ విధంగా పరిష్క రిస్తే మంచిదో నిర్ణయించు కోవాలి!" అన్నాడు.

కేశవనాథుడు మృదుమందహాసంతో శిష్యు లందరి మధ్యా అపేక్షశర్మను అర్హునిగా ప్రక టించాడు. గురువుగారి 'అర్హత'ను అంగీక రించారు అందరూ.






అప్పలస్వామికి దేవుడంటే అసలు నమ్మకం లేదు. పరమ నాస్తికుడు. దేవాలయాలకు వెళ్లేవారిని పిరికివాళ్ళుగా... మూర్ఖులుగా భావించేవాడు.

ఓ రోజు అతడుండే వూరికి స్వామి శివానంద అనే సాధువు భగవద్గీతను ఉపదేశించడానికి వచ్చారు. జనం సముద్రంలా వెళ్ళి ఆయన వాక్కులు వినసాగారు.

అప్పలస్వామిలో మెరుపులాంటి ఆలోచన కలిగింది. ఆ వెంటనే అతడు స్వామి శివానంద దర్శనం చేసుకున్నాడు.

ఆయన అప్పలస్వామి వంక వాత్సల్యంగా చూశారు. అప్పలస్వామి స్వామితో, "స్వామీజీ! పాపం శారీరకంగా చేసినా, మానసికంగా చేసినా ఒకటే అని కదా భగవద్గీత చెపుతోంది?" అని ప్రశ్నించాడు.

"అవును నాయనా!" అన్నారు స్వామీజీ. "మానసికంగా పాపం చెయ్యని మనిషి అంటూ ఉండడు. అందువలన మీ సిద్ధాంతం ప్రకారం అందరూ పాపాత్ములే! నరకం అంటూ ఉంటే అందరూ దానికి పోతారు. అలాంటప్పుడు శారీరకంగానూ పాపం చేస్తే మాత్రం నష్టమేమిటి? మరి ఎందుకు మీకీ అనవసరపు ప్రసంగాలు?" అని అడిగాడు.

ఆ మరుక్షణం స్వామి శివానంద అప్పలస్వామి చెంప ఛెళ్ళుమనిపించారు. అంతమందిలో తనను కొట్టేసరికి అప్పలస్వామికి కోపం వచ్చేసింది. "స్వామీ! మీకు ఇష్టం ఉంటే సమాధానం చెప్పాలి. లేకపోతే లేదు! అంతే కాని, నన్ను కొట్టే అధికారం మీకు ఎవరు ఇచ్చారు?" అని ఆగ్రహంగా ప్రశ్నించాడు.

స్వామి వాత్సల్యంగా, "నాయనా.. నేను మానసికంగా నిన్ను కొట్టాలని అనుకున్నాను అనుకో! అది పాపం! నీకు తెలియదు. కొట్టాను! అదీ పాపం! అందుకే నీకు ఇంత కోపంవచ్చి ఆగ్రహం ప్రకటించావు. శారీరక పాపానికి, మానసిక పాపానికీ అంత వ్యత్యాసం ఉంది. నీలోనే ఉన్న దేవుడిని నువ్వు చూసుకోగలిగితే నీకు దేవుడు అవసరం లేదు" అన్నారు.

అది విని అప్పలస్వామి సిగ్గుతో తల వంచుకున్నాడు.



జి. లీలాకుమారి – రాజమండ్రి




# టెలిఫోన్, సెల్ ఎలా పనిచేస్తున్నాయి ?

ఈ రోజు యిల్లు కదలకుండా మాట్లాడు కోవడానికి టెలిఫోన్ చక్కటి సాధనం! ఫోన్ కనిపెట్టాకనే వ్యాపారాలు బహుముఖంగా విస్తరిం చాయి! 1876లో అలగ్జాండర్ గ్రహంబెల్ టెలిఫోన్‌ని కనిపెట్టాడు.

టెలిఫోన్ మూలసూత్రం– ధ్వని ఎలక్ట్రిసిటీగా మార్చి – అది రిసీవర్ చేరగానే తిరిగి ధ్వనిగా మారుతుంది. ధ్వని అంటే ఏమిటి?– గాలిద్వారా శబ్ద తరంగాలు ప్రకంపించడమే ధ్వని.

మౌత్‌పీస్‌లోని ధ్వని తరంగాలు ఉధృతానికి డియాఫర్‌గ్రామ్ కదులుతుంది. చిన్న రాగి కప్పులో కార్బన్ గ్రానుల్స్ వుంచబడతాయి. ఓప్రక్క ఫీక్స్‌బిల్ మెటల్ డియాఫర్‌గ్రామ్– ఎలక్ట్రో మాగ్నెట్ ద్వారా పనిచేస్తుంది.

రిసీవర్ – రిసీవర్‌లో మాట్లాడగానే డియా ఫర్‌గ్రామ్ కార్బన్‌గ్రాన్సుమీద కదలిక యిస్తుంది.

శబ్దం ఎలక్ట్రో మేగ్నెట్‌ద్వారా ఎలక్ట్రిక్ కరంట్‌గా ప్రయాణం చేస్తుంది. లోహపు డియాఫర్‌గ్రామ్ వైబ్రేషన్స్‌కి గాలిలో శబ్దతరంగాలు ప్రయా ణిస్తాయి అవి అసలు శబ్దానికి నకళ్లుగా వుంటాయి.

డయల్ – నెంబరు తిప్పగానే అది వలయా కారంగా తిరుగుతుంది. స్ప్రింగ్‌వల్ల ఫింగర్‌ప్లేటు తిరిగి యథా స్థానానికి వస్తుంది. ఫింగర్‌ప్లేటు తిరిగిరాగానే, గీర్లు పనిచేస్తాయి. ఆఖరి గీరుకి కామ్ అనే రైజ్‌డ్‌పిన్ అనుసంధానపరచబడి వుంటుంది. కామ్ ఒకసారి గుండ్రంగా తిరిగి నప్పుడల్లా రెండు కాంటాక్ట్సు ఓపెన్ అయి ఎలక్ట్రిసిటీని ఫోన్‌వైర్స్‌లోకి పంపుతాయి. పల్సింగ్ కామ్ మీరు నంబర్లు తిప్పినంతసేపు స్పందిస్తూ వుంటుంది. ప్రల్సింగ్ ఆపరేట్‌చేసి కీబోర్డ్ టెలి ఫోన్ ఎక్స్చేంజ్‌లో వుంటుంది. అందువల్ల మీరు డయల్ చేసిన నెంబర్ ఫోన్ రింగ్ అవుతుంది.

సెల్‌ఫోన్ కూడా గత 10 సం॥ల నుండి బాగా వాడుకలోనికి వచ్చింది. ఈ రోజుల్లో సెల్ లేకుండా ఎవరూ వుండలేకపోతున్నారు.

పి. దాక్షాయణి – విజయవాడ

# బుజ్జాయి మినీ న్యూస్
BUJJAYI MINI NEWS

సంపుటి : 39 సంచిక : 1
February-2013 నిర్వహణ: జి.ఎ.రావు


## బోడిగుండైన వటవృక్షాలు!

అది తమిళనాడు రాష్ట్రంలోని ఈరోడ్ జిల్లా మొడకురిచ్చి అనే కుగ్రామం. అక్కడ మగబిడ్డలు పుట్టేవారి సంఖ్య తగ్గుతూ వస్తోందట! ఈ విషయం గమనించిన వారిలో ఒకరు "వటవృక్షం పెరిగే కొద్దీ మగవారి సంఖ్య తగ్గిపోతుంటుంది" అని చెప్పారట. దాంతో ఆ గ్రామస్తులు వెంటనే తమ గ్రామంలోని రెండు వటవృక్షాలను కాండం మినహా మిగిలినదంతా కొట్టేసారు. నిన్న మొన్నటి వరకు పచ్చని ఆకులతో కళకళలాడిన ఆ చెట్లు రెండూ ఇప్పుడు బోడిగుళ్లై దర్శనమిస్తున్నాయి. ఈ రెండింట్లో ఒకటి-చిన్నప్ప గౌండర్ అనే వ్యక్తిది. ఆయన ఒకానొకసారి తమ మగ సంతతి వృద్ధికోసం నాటిన వటవృక్షంగా వుండటం గమనార్హం.

వటవృక్షాన్ని ప్రదక్షిణంచేసి చెట్టుకింది భాగానికి నమస్కరిస్తే బిడ్డలు పుడతారనే నమ్మకమున్న తమిళనాడులో ఇప్పుడీ విచిత్రం కూడా చోటు చేసుకుంది.

## భారత మహిళ రికార్డు!

ఎవరెస్టు శిఖరాన్ని అధిరోహించిన భారత వృద్ధ మహిళా పర్వతారోహకురాలు ప్రేమలత అగర్వాల్ (48) మరో రికార్డును సృష్టించారు. అంటార్కిటికాలోని మౌంట్ విన్సన్‌కు ఆమె ఇటీవల అధిరోహించారు. దీంతో ఏడు ఖండాల్లోని ఆరు ఎత్తయిన పర్వతాలను ఎక్కిన భారత మహిళగా రికార్డు నెలకొల్పారు. వచ్చే మే, జూన్ నెలల్లో ఉత్తర అమెరికాలోని మౌంట్ మెకన్లీ, డెనాలీని

వుండాలి. 22 ఏళ్ళలోపు వయస్సు వుండి పెళ్లి చేసుకునుంటే అది ఆరోగ్యానికి మంచిది కాదనేది వారి అభిప్రాయం.

పెళ్లి రిజిస్ట్రేషన్ అధికారి సమక్షంలో జరుగుతుంది. రిజిస్ట్రేషన్ పుస్తకంలో నవదంపతులు సంతకాలు చేస్తే పెళ్లి అయినట్లే లెక్క. వారికి రిజిస్ట్రేషన్ అధికారి సహోదు పత్రం యిస్తారు, ఆశీర్వదిస్తారు. ఆ తర్వాత పెళ్లికి వచ్చిన వారు నవదంపతులకు పుష్పగుచ్ఛాలు యిస్తారు.

ఆశీస్సులు పొందిన తర్వాత నవదంపతులు అప్పటికే ఏర్పాటు చేసిన కారెక్కి హనీమూన్ కెళ్తారు. పెళ్లికి వచ్చిన అతిథులకు కళ్యాణ మండపంలో విందు ఏర్పాటు చేస్తారు.

దంపతులు ఒకవేళ విడిపోవాలనుకుంటే ఇద్దర్లో ఎవరైనా దరఖాస్తు పెట్టుకోవచ్చు.

అయితే ఆ దరఖాస్తు అందుకున్న న్యాయమూర్తి వారు కలిసి వుండేందుకే ప్రయత్నిస్తారు. ఆ ప్రయత్నాలు ఫలించినప్పుడే విడాకులు యిస్తారు.

భార్య గర్భిణిగా వున్నప్పుడు, పిల్లలు పుట్టిన ఏడాది వరకు విడాకులు యివ్వదు న్యాయస్థానం. అప్పటివరకు భార్యాభర్తలు కలిసే వుండాలి.

భార్య పుట్టింటికి వెళ్లే అలవాటు యిక్కడ లేదు. న్యాయస్థానం ఉత్తర్వులు వచ్చేవరకు వారిద్దరు కలిసే బతకాలి.

అధిరోహించేందుకు ప్రయత్నించనున్నట్లు ఆమె చెప్పారు. దీనివల్ల అన్ని ఖండాలలోని ఎత్తయిన పర్వతాలను అధిరోహించిన అరుదైన గుర్తింపు ఆమెకు లభిస్తుంది!

గతంలో ఓసారి ఆమె మౌంట్ మెకెన్లీ, డెనాలీని ఎక్కేందుకు ప్రయత్నించినప్పుడు వాతావరణం అనుకూలించకపోవడంతో సాహసయాత్రను మధ్యలోనే ముగించారు. ప్రేమలతకు టాటా స్టీల్ అడ్వెంచర్ ఫౌండేషన్ స్పాన్సర్‌గా వ్యవహరిస్తోంది.

జనవరి (2013) 6వ తేదీన మౌంట్ విన్సన్ పర్వతాన్ని (16,050 అడుగులు) ఎక్కిన ఆమెకు ఇప్పటికే లిమ్కా బుక్‌లో స్థానం దక్కింది. ఆమెకు ఇద్దరు పిల్లలు. ఆమె తన 35వ ఏట పర్వతారోహణ ప్రారంభించారు.

## రష్యాలో పెళ్ళితంతు!

సోవియట్ యూనియన్‌లో పూర్వం పదిహేను ప్రాంతాలు వుండేవి. అవి ఇప్పుడు వేర్వేరుగా విడిపోయాయి. ఈ పదిహేను దేశాలలో ఇప్పటికీ పెళ్లితంతు పూర్వంలాగానే వున్నాయి.

ఈ ప్రాంతాలలో తెగ, భాషలకు అతీతంగా ప్రేమించి పెళ్లి చేసుకుంటున్నారు. వేరే తెగల వారితో పెళ్లి చేసుకున్నామనే అభిప్రాయ భేదాలు ఏవీలేకుండా ఎంతో సహజంగా పెళ్లిళ్ళు చేసుకుంటున్నారు.

పెళ్లి రోజున ప్రత్యేకించి కొత్త వస్త్రాలు ధరిస్తారు. అన్ని పెళ్ళిళ్లురిజిస్టర్ మ్యారేజస్సే. ఈ రిజిష్టర్ ఆఫీసులను ఆనుకునే కళ్యాణ మండపాలుంటాయి. నవ దంపతులకు వారి వారి పెద్దలు, సమీప బంధువులు, సన్నిహితులు వస్తారు.

పెళ్లి చేసుకోబోయే అమ్మాయి వయస్సు 22 ఏళ్లు పైబడి

## నొప్పులకు ధ్యానంతో ఉపశమనం!

కీళ్లనొప్పులు, ఉబ్బసం వంటి తీవ్ర ఆరోగ్య సమస్యలతో బాధపడే వారికి ధ్యానంతో ఉపశమనం కలుగుతుందని ఓ అధ్యాయనంలో వెల్లడైంది. అలాంటి సమస్యల విషయంలో మానసిక ఒత్తిడే అధికంగా వుంటుంది. దీంతో విపరీతమైన బాధ ఉంటుంది. ఇలాంటి పరిస్థితులలో ఏకాగ్రతతో కూడిన ధ్యానం వల్ల ప్రయోజనం కలుగుతుందని అధ్యాయన కర్తలు తెలిపారు. శ్వాస, శారీరక స్పర్శపై దృష్టి సారించి ధ్యానంలో లీనమైతే ఒంటినొప్పులు నయమవుతాయని వారంటున్నారు.

## మల్లికి గుర్తింపు!

మగువల మనసులను దోచే మల్లిపువ్వుకి భౌగోళిక గుర్తింపు దక్కింది. తమిళనాడులో మదురై మల్లి పువ్వులు పెట్టింది పేరు. చెన్నైలోని భౌగోళిక గుర్తింపు (జీఐ) కార్యాలయ ఉన్నతాధికారి చిన్నరాజ జీ. నాయుడు ఒక ప్రకటనలో ఈ విషయాన్ని పేర్కొన్నారు. ఆ రాష్ట్రంలోని మదురై, శివంగై, విరుదునగర్ తదితర జిల్లాల్లో రైతులు సంప్రదాయ మదురై మల్లిపువ్వు రకాన్ని విరివిగా పండిస్తుంటారు. ఈ మల్లెపువ్వుల రకం కాస్తంత మందంగా వుంటాయి. కోసిన తర్వాత ఎక్కువ సమయం తాజాగా వుండి పరిమళించే ఈ పువ్వుకు భౌగోళిక గుర్తింపు లభించినట్లు అధికారి తెలిపారు. ఈ గుర్తింపువల్ల రైతులకు న్యాయపరమైన రీతిలో తగిన ఆదాయం వస్తుంది.

అలాగే మన రాష్ట్రంలో కూడా చాలా ప్రాంతాల్లో చాలాచోట్ల ఈ ఎండాకాలంలో మల్లెలు పండించే రైతులు చాలామంది ఉన్నారు.

# మాతృమూర్తి !

పన్నెండేళ్ళ వీరేశ్వరుడు ఏక సంతాహగ్రాహి కావడంవల్ల ఇంట్లో పాఠాలు వల్లెవేసేవాడు కాదు. బైటికి వెళ్ళి పిల్లలతో కలిసి బాగా అల్లరి చేసేవాడు.

ఒకనాడు తల్లి భువనేశ్వరీదేవి వీరేశ్వరుడిని తీవ్రంగా మందలించి బుద్ధి చెప్పబోయింది. తల్లిని తూలనాడి విసురుగా బైటికి వెళ్ళిపోయాడు.

భువనేశ్వరీదేవి కొడుకు తిట్టినందుకు కాదు గాని పిల్లాడి ప్రవర్తన భవిష్యత్తు గూర్చి కలవర పడింది.

ఆమె భర్త విశ్వనాథుడు ప్రముఖ న్యాయవాది. ఆయన కోర్టునుండి వచ్చాక జరిగింది చెప్పి దండించమని కోరింది.

"పిల్లలుచేసే తప్పులను వారి హృదయానికి సూటిగా తాకేటట్లు చేస్తే అర్థం చేసుకుంటారు. తిట్టి, కొడితే బండబారిపోతారు. నేను వాడిని సరిదిద్దుతాను. చింతించకు" అని భార్యను సముదాయించాడు.

తర్వాత కోటు విప్పి కాఫీ సేవించిన విశ్వనాథుడు వీరేశ్వరుడి గది లోపలికి వెళ్లాడు. తర్వాత వెలుపలికి వచ్చి బైటికి వెళ్లాడు.

అప్పుడే బైటినుండి వచ్చిన వీరేశ్వరుడు కాళ్ళు నీళ్ళతో శుభ్రంచేసుకున్నాడు. తన గది లోపలికెళ్లాడు.

"కన్నతల్లిని దెయ్యాలు కూడా నిందించవు" అని గోడపైన తండ్రి సుద్దముక్కతో రాసిన ఏక వాక్యం చదువుకున్న వీరేశ్వరుడు మనసులో సిగ్గుపడ్డాడు.

వెంటనే తల్లికి క్షమాపణ చెప్పాడు. అల్లరి కట్టిపెట్టి విద్యపై దృష్టి సారించాడు. ఆ బాలుడే స్వామి వివేకానందుడు.



మాదవరపు కృష్ణ – కాకినాడ

# బాతు పులుసు !

నసీరుద్దీన్‌ను చూడటానికి పల్లెటూరి నుంచి ఒకతను వచ్చాడు. తనతో ఒక బాతున కూడా తెచ్చాడు. నసీరుద్దీన్ కృతజ్ఞతలు చెప్పి, బాతు కూర వండించి ఆ అథిధితోపాటు ఆరగించాడు.

ఇప్పుడు మరో వ్యక్తి వచ్చాడు. "మీకు మొన్న బాతు యిచ్చిన అతని స్నేహితుణ్ణి" అని చెప్పాడు. నసీరుద్దీన్ శక్త్యానుసారం అతనికి భోజనం పెట్టాడు.

అలా చాలాసార్లు జరిగింది. పల్లెటూరినుంచి వచ్చేవాళ్ళకు నసీరుద్దీన్ యిల్లు ఒక సత్రంలా మారింది. వచ్చిన ప్రతి ఒక్కరు కూడా బాతు యిచ్చిన వ్యక్తికి దగ్గర బంధువో, దూరపు బంధువో అయివుండేవాడు.

ఆఖరికి నసీరుద్దీన్‌కు చిర్రెత్తుకొచ్చింది.

ఒక రోజు ఎవరో తలుపు తట్టారు. చూస్తే కొత్త వ్యక్తి.

"నేను మీకు బాతు యిచ్చిన స్నేహితుని స్నేహితుణ్ణి" అన్నాడు.

"అలాగా! లోపలికి రండి" అన్నాడు నసీరుద్దీన్.

ఇద్దరూ భోజనాల బల్లదగ్గర కూర్చున్నారు. నసీరుద్దీన్ తన భార్యను, "బాతు పులుసు తీసుకురా" అన్నాడు.

అతిథి ఆ పులుసు రుచి చూసాక అతనికి అది వేడినీళ్ళు తప్ప మరేంకాదని అర్థమైంది. "ఇదేం పులుసు?" అని అడిగాడు ఆశ్చర్యంగా !

"అది బాతుపులుసు యొక్క పులుసు యొక్క పులుసు" అన్నాడు నసీరుద్దీన్.



మేకల మదన్‌మోహన్‌రావు - మిర్యాలగూడ



# సర్దుబాటు - సౌఖ్యం !

వేసవికాలం ఆ అడవిలో నివసిస్తున్న ఓ సింహానికి, ఎలుగుబంటికి దాహమయింది. ముందుగా వచ్చిన ఎలుగుబంటు రేవులో దిగి నీళ్లు త్రాగుతుండగా, దానిని ఒక పక్కకు నెట్టి దప్పిక తీర్చుకోబోయింది సింహం.

సింహం గర్వానికి కోపించిన ఎలుగుబంటి, "నీళ్లు త్రాగుతున్న నన్ను పక్కకు పడదోసే అధికారం నీ కెవరిచ్చారు?" అంది.

"నా అధికారాన్ని ప్రశ్నించే ధైర్యం నీకెవరిచ్చారు?" అంది సింహం.

"న్యాయం నావైపు వుంది" అంది.

"ఏమిటి నీ న్యాయం, పుట్టలో సుఖంగా ఉంటూ నీజోలికెన్నడూ రాని చీమల్ని నువ్వు ఒక్కపట్టున పీల్చివెయ్యడం లేదూ? అది న్యాయమేనా?" అంది సింహం.

అడవిలో మొలచిన పచ్చిక మేసి జీవిస్తూ నీకు ఏ కీడూ చేయని లేళ్ళనూ, కుందేళ్ళనూ నువ్వు వేటాడి మింగటంలేదూ? నీకు న్యాయం ఉందా?" అన్నది ఎలుగుబంటి.

సింహం, ఎలుగుబంటి ఇలా తగాదాపడుతూండగా ఆ వింత చూడటం కోసం కొన్ని గద్దలూ, కాకులూ వచ్చి మడుగు సమీపాన చెట్టుమీద వాలాయి.



డి.కె. చదువులబాబు - ప్రొద్దుటూరు

వాటిని చూసి సింహం, ఎలుగుబంటితో "ఈరోజున నా చేతిలో నువ్వు చస్తావని, నీ మాంసం తృప్తిగా తినవచ్చునని కాకులు, గద్దలూ ఎన్నొచ్చాయో చూచావా?" అంది.

నా దెబ్బకు నువ్వు చచ్చిపడతావని వాటికి తెలుసు, అవి నీ మాంసం తినటానికే వచ్చాయి" అంది ఎలుగు.

ఆ మాటలు విని కాకులు, గ్రద్దలు నవ్వుకున్నాయి. వాటి నవ్వులు గమనించిన ఎలుగుబంటి, సింహంతో "మనకు దప్పిక తీరటం ముఖ్యం కాని వెనుకయితేనేమి? ముందయితేనేమి? లేకపోతే ఇద్దరం చావటం తథ్యం. మన బుద్ధిలేని వాగ్వివాదానికి ఆ పక్షులు ఎలా నవ్వుతున్నాయో చూడు!" అంది.

సింహం తలెత్తి చూసి, "భల్లూక రాజా! నీ మాట వాస్తవం. మన జగడం చాలిద్దాం, నువ్వే ముందు దాహం తీర్చుకో" అంది.

"నువ్వు రాజీకి వచ్చావు కాబట్టి నువ్వే ముందు దాహం తీర్చుకో" అని ఎలుగుబంటి ప్రక్కకు తప్పుకుంది.

ఇలా రెండూ రాజీకి వచ్చేసరికి పక్షులు నిరాశతో ఎగిరిపోయాయి. సింహం, ఎలుగు దాహం తీర్చుకుని సుఖంగా వెళ్ళిపోయాయి.

కయ్యం కీడు చేస్తుంది. సర్దుబాటు, స్నేహాన్ని సౌఖ్యాన్నిస్తుంది.



# మార్పు!

అమెరికాలోని ఒక స్కూల్లో వ్యాయామ ఉపాధ్యాయుడైన స్మిత్ ఆనాడు పాఠశాల ఆవరణలో విద్యార్థులతో బాస్కెట్‌బాల్ ఆట ఆడిస్తున్నాడు.

పిల్లలు హుషారుగా ఒకరి నుండి మరొకరు బంతిని ఒడుపుగా హస్తగతం చేసుకుంటూ పోయి లాఘవంగా బాస్కెట్లలోకి వేస్తున్నారు. అలా వేసాక నిలబడి చూస్తున్నారు.

ఇప్పటిలాగ బంతి కిందపడదు. బాస్కెట్లో ఉండిపోతుంది. అప్పుడు ఎవరో ఒకరు నిచ్చెన వేసుకుని ఎక్కి బంతిని బైటికి తీసి యిచ్చాక తిరిగి ఆట కొనసాగేది. బంతి పడిన ప్రతీ పర్యాయం సదరు అంతరాయం వల్ల ఆటలో వేగం తగ్గటమే గాక ఆటగాళ్ళలో నిరుత్సాహం కలిగేది.

స్మిత్ గత కొద్ది రోజులు నుండి బాస్కెట్‌లో పడ్డ బంతి వెంటనే క్రీడాకారులకి చేరడానికి ఆటలో తగిన మార్పు తేవాలని తీవ్రంగా ఆలోచిస్తున్నాడు.

ఆనాడు ఆ మార్పు కనిపెట్టాడు.

వెంటనే స్మిత్ రెండు బాస్కెట్ల అడుగు భాగాలను కత్తిరించాడు. తర్వాత నిచ్చెన దిగాక బంతిని బాస్కెట్లోకి విసిరాడు. పడింది. పడ్డ బంతి పడ్డట్టు కింద నేలపై పడింది. వెంటనే ఆటగాళ్లు స్మిత్ సముచిత మార్పుకి ఆనందించి చప్పట్లు చరిచారు. తర్వాత ఆట నిరాఘాటంగా సాగింది. ఇప్పుడూ అలాగే కొనసాగుతుంది.



మాదవరపు కృష్ణ - కాకినాడ




సౌశీల్యదేశంలోని ఒక మారుమూల గ్రామమైన నిరంజనవరానికి ఒక ప్రత్యేకత వుంది. అక్కడి గ్రామాధికారి అంబరీషుడు గొప్ప విష్ణుభక్తుడు. చిన్నవయసులోనే సకల శాస్త్రాలనూ ఔపాసన పట్టిన మహామేధావి. అతడు తన తెలివితేటల్తో తన అభిరుచుల మేరకు గ్రామాన్ని ఉత్తమంగా తీర్చిదిద్దాడు.

గ్రామస్తులకు ముందుగా దైవభక్తిని, పాపభీతిని నూరిపోశాడు. అది వారిలోని కుయుక్తులనూ, సాటివారిని మోసం చేసే కుత్సితాన్ని హరించింది. ప్రజల శ్రమశక్తితో, గ్రామానికి సమీపంగా వెళుతున్న కైరవణీ నదికి ఆనకట్ట కట్టి, భూముల్ని సస్యశ్యామలం చేయించాడు. ఇలా ఎన్నో రకాలుగా గ్రామాన్ని అభివృద్ధి పరిచాడు. గ్రామస్తులకు అంబరీషుడంటే చాలా అభిమానం. తాము కొలిచే దేవుణ్ణి ఎప్పుడూ చూడలేదు కానీ దేవుడంటూ వుంటే మాత్రం అచ్చం అంబరీషుడి లాగే వుంటాడని వాళ్ళ నమ్మకం.

ఒకనాటి మిట్టమధ్యాహ్నం అకస్మాత్తుగా మబ్బు బట్టి భోరున కుంభవృష్టి కురవసాగింది. ఆ వర్షంలో ఒక వ్యక్తి నిరంజనవరం చేరి, కైరవిణీ నదీ తీరాన్నున్న కేశవాలయానికి ఎదురుగా వున్న రావిచెట్టు క్రింద కూర్చున్నాడు.

ఆ సమీపంలోనే ఏదో పనివుండి వచ్చి, వర్షానికి ఆలయంలో తల దాచుకున్న అంబరీషుడు ఆ వ్యక్తిని చూసి బయటకు వచ్చి, "అయ్యా, తమరెవరో పరదేశిలా వున్నారు. ఆలయంలోనికి వచ్చి తలదాచుకోండి" అన్నాడు.

ఆ వ్యక్తి అంబరీషుని వంక ఆశ్చర్యంగా చూస్తూ "మాకు దేవుడిపై నమ్మకం లేదు. మేము ఆలయంలోనికి ప్రవేశించం" అన్నాడు.

ఆ మాటలకు అంబరీషుడు విస్తుపోయి



"అలాగయితే ఆ ప్రక్కనే ఒక మండపం వుంది. మీరు అందులో తలదాచుకోవచ్చు" అన్నాడు.

ఆ వ్యక్తి అంబరీషుని వెంట మండపం లోనికి వచ్చాడు. అతడు వర్షంలో బాగా తడిచి వున్నందున అవసరమైన సపర్యలన్నీ ఆలయ సిబ్బందిచేత చేయించి, తర్వాత తేలికగా అంబరీషుడు అతడి వివరాలు అడిగాడు.

ఆ వ్యక్తి తన గురించి యిలా చెప్పాడు- "నా పేరు కృపాళుడు. సర్వశాస్త్రాలూ చదివాను. చివరికి భగవంతుడు మిథ్య అని తెలుసుకున్నాను. భగవంతుని పేరుమీద అమాయకులు మోసగించబడుతున్నారు. వారిని జాగృతం చెయ్యడానికి కంకణం కట్టుకున్నాను. అందుకే దేశ దేశాలు తిరుగుతూ, ఎంతోమంది భగవత్ భక్తులతో వాదించి, వారిని ఓడించి వస్తున్నాను. ఈ గ్రామంలో అంబరీషుడనే గొప్ప భక్తుడున్నాడని విని అతనితో వాదించాలని వచ్చాను".

అంబరీషుడు క్షణం ఆలోచించి, "మీకు ఆశాభంగం కల్గిస్తున్నాను, క్షమించండి. అంబరీషుడు గ్రామాంతరం వెళ్ళాడు. తిరిగి రావడానికి వారం రోజులు పట్టవచ్చు. నేను ఆయన శిష్యున్ని, మీకు అభ్యంతరం లేకపోతే భగవంతుని ఉనికి గురించి నేను తమతో వాదించగలను" అన్నాడు.

కృపాలుడు అంబరీషునివంక ఆశ్చర్యంగా చూస్తూ, చూస్తే చాలా చిన్నవాడివిగా కన్పిస్తున్నావు. నీవు నాతో ఏం వాదించగలవు?" అన్నాడు.

"తమరు నన్ను ఓడించనిదే మా గురువు గారితో వాదించలేరు" అన్నాడు.

కృపాళుడు అతనితో వాదించడానికి ఒప్పుకున్నాడు. అంబరీషుడు మరునాడు అందుకు తగిన ఏర్పాట్లు చేశాడు.

కృపాళుడి గురించి గ్రామంలో అందరికీ తెలియడం మూలంగా మరునాడు అంతా కుతూహలంగా ఆలయ ఆవరణలో సమావేశమయ్యారు.

ఇద్దరికీ వాగ్వివాదం మొదలయ్యింది.

భగవంతుని ఉనికిని తెలియజేసే అంబరీషుని వాదనను కృపాళుడు ఎంతో తెలివిగా ఖండించసాగాడు. అలాగే కృపాళుడి వాదనను



పనిచేసే ప్రతిసారీ సత్ఫలితాలు రావు. కానీ పనిచేయకపోతే ఏ ఫలితమూ ఉండదు

అంబరీషుడు ఖండించసాగాడు. వాద ప్రతి వాదాలు చాలాసేపు కొనసాగాయి. చివరికి కృపాళుడు విసిగిపోయాడు. అలాంటి సంద ర్భాల్లో అతడు మొండివాదనలోనికి దిగాడు.

"అయితే భగవంతుని వునికిని అంతగా నమ్ముతున్నావు కదా! ఒక్కసారి నీ దేవున్ని నాకు చూపించు. నీ వాదనను అంగీకరించి, దేవు దున్నాడని నమ్మి, నా దారిన నేను పోతాను" అన్నాడు.

అంబరీషుడు అతడి వితండతర్కానికి విసుక్కుంటూ సౌమ్యంగా నవ్వి, "మీరు గొప్ప దైవభక్తులు. ఎటొచ్చి ఆయన మీకు కన్పించక పోవడంతో, వెతుక్కుంటూ బయలుదేరారు. భగవంతుడు లేడని మీకు నిశ్చయంగా తెలీదు. తెలియదు కాబట్టి – ఉన్నాడేమో తెలుసుకుందా మని ఆరాడంతో బయలుదేరారు. మీరు కోరినట్లుగా... నేను మీకు భగవంతున్ని చూపించ గలను. కానీ ఆయనను చూడగల శక్తి మీలో వున్నదా?" అన్నాడు.

కృపాళుడు ఎగతాళిగా నవ్వి, ఎందుకు చూడలేను. తప్పకుండా చూడగలను. ముందు చూపించు" అన్నాడు.

"ఆ శక్తి మీలో లేదని నిశ్చయంగా చెప్ప గలను. ఒకవేళ వున్నట్లయితే భగవంతుని వునికి మీద వాదిస్తూ యింతదూరం రారు. ఈ సృష్టిలో దేని గురించి తెలుసుకోవాలన్నా మనిషికి ఆయా యింద్రియా లుండాలి. ఉదాహరణకు ఎదురుగా కన్పించే మనుషుల్ని, చెట్లను, చేమలు చూట్టానికి



కళ్ళు అవసరం. శబ్దం వినడానికి చెవులూ, వాసన తెలుసుకోవడానికి ముక్కూ రుచి తెలుసు కోవడానికి నాలుక – ఈ యింద్రియాలు ఎలాగో భగవంతుణ్ణి చూడటానిక్కూడా ప్రతి మనిషి లోనూ ఒక విశిష్టమైన యింద్రియం వుంటుంది. అదే జ్ఞాననేత్రం. కళ్ళు లేనివాడికి రమణీయమైన ప్రకృతిని ఎంత భాషాజాలం గ్రుమ్మరించినా కనిపించేలా చేయలేము. చెవిటివాడికి మృదు మధుర సంగీతంలోని హాయిని సైగలతో తెలియ పరచలేము. అలాగే ఆ జ్ఞాననేత్రం లేని వ్యక్తికి ఎంతగా వివరించినప్పటికి, మాటలతో భగవం తుని చూపలేము. ఆ వ్యక్తి తానే స్వయంగా భగవంతున్ని చూడగలగాలి."

కృపాళుడు మాట్లాడలేదు.

సొంతలాభం కంటే ఎదుటివారిగురించికూడా కొంచెం ఆలోచించు

"మీలో వున్న జ్ఞాన నేత్రం ప్రస్తుతం మూసుకుని వుంది. సాధనచేసి దాన్ని తెరుచుకునేందుకు ప్రయత్నం చెయ్యండి. అప్పుడు సృష్టిలోని ప్రతి జీవిలోనూ భగవంతున్ని చూడగలరు" అన్నాడు అంబరీషుడు.

కృపాలుడికి అంబరీషుడి వాదన క్రొత్తగానూ, ఆసక్తిగానూ అన్పించింది. కొంతకాలం అక్కడ వుండాలనుకొన్నాడు. ఆ విషయమే అంబరీషుడితో చెబితే, అతడు అందుకు అంగీకరించి తగిన ఏర్పాట్లు చూశాడు.

కొద్ది రోజుల్లో కృపాలుడు ఆ గ్రామం స్థితి గతులన్నీ పూర్తిగా ఆకళింపు చేసుకున్నాడు. ఒక రోజు అతను అక్కడినుంచి ప్రయాణమై వెళుతూ "మీ గురువుగారైన అంబరీషుడు మహానుభావుడని నాకు తెలుస్తున్నది. ఆయన శిష్యుడివైన నీవు ధన్యుడివి. గ్రామంలో ఎవరి నోట విన్నా అంబరీషుడన్న పేరే... నేను ఆయనను చూడలేక పోయానే అన్న విషయం నన్ను బాధిస్తోంది" అన్నాడు.

అంబరీషుడు చిన్నగా నవ్వి, "మీరు బాధపడ నవసరం లేదు. నేనే అంబరీషున్ని" అన్నాడు.

కృపాలుడు విస్మయంతో అంబరీషున్ని కావలించుకుని, "నాయనా, నే నింత కాలం అజ్ఞానంలో నడిచిన మాట వాస్తవం. భగవంతుడు అంటే నే నూహించిన నిర్వచనం తప్పని ఇప్పుడే తెలుసుకున్నాను. నా జ్ఞాన నేత్రం వికసిస్తున్నట్లున్నది. నేను యిప్పుడిప్పుడే భగవంతుని చూడగలుగుతున్నాను." అంటూ సెలవు తీసుకుని వెళ్ళిపోయాడు.





మనిషి జీవితంలో వచ్చే ప్రతి రోజూ క్రితం రోజుకన్నా ఎంతోకొంత జ్ఞానాన్ని పెంచుతుంది



# ఒకేధర్మం! ఒకేదేవుడు!

ఒక గ్రామంలో రామ్‌స రహీం, రాబర్ట్ అనే ముగ్గురు స్నేహితులుండేవారు. వారు ఎక్కడికి వెళ్ళినా కలసి వెళ్ళేవారు. వారు ఏమైనా తినాలనుకుంటే ఒకరికొకరు విడిచి తినేవారు కాదు. వారు అంతటి స్నేహితులు. ఐతే చాలా దైవభక్తులు.

రామ్ హిందూ మతస్తుడు, ప్రతి రోజు దేవాలయానికి పోయి మనసారా దేవుని పూజించేవాడు. మరియు తను ముఖ్యమైన 'భగవద్గీత' లోని శ్లోకాలను చదువుతుండేవాడు.

రహీమ్ ముస్లిము కులమువాడు. ప్రతి దినం మసీదుకెళ్ళి నమాజు చేసేవాడు. తను పవిత్ర 'ఖురాన్' పఠించేవాడు.

రాబర్ట్ క్రైస్తవుడు కావడంతో రోజూ చర్చికి పోయి ప్రార్థన చేస్తూండేవాడు. 'బైబులు'ను తిరగేస్తుండేవాడు. వారి కులాలు వేరైనా మనస్సు ఒక్కటే. ఎంతటి స్నేహితులో అంతకంటే ఎక్కువ దైవభక్తి కలవారు.

ఒకనాడు రామ్ "భగవద్గీత చాలా గొప్పది. పాపాలు చేసినవారు చదివితే వారి పాపాలు పోతాయి" అన్నాడు.

అందుకు రహీమ్ "ఖురాన్ ఎంతో పవిత్రమైనది. దీన్ని పఠించిన పాపులు ఎవరైనా కూడా పాపవిముక్తులవుతారు." అన్నాడు.

ఆ తర్వాత రాబర్ట్ "బైబులు మహాగొప్పది. పాపాలు చేసినవారికి విముక్తి కలగటమే కాక కళ్ళు లేనివారికి కళ్ళుకూడా వస్తాయి"అన్నాడు. ఆ ముగ్గురూ రోజూ అలా అనుకుంటుండేవారు.

ఒకరోజు ఒక సాధువు రామ్ వద్దకువెళ్ళి, "భగవద్గీతను మించిన గ్రంథం మరేదీ లేదు. ఎంతో మహిమ గలది. నీవు చదివి దాని

కంచనపల్లి వేంకట కృష్ణారావు - కర్నూలు



మహిమను చూపాలి. అప్పుడే నీ భక్తి గొప్పదని తెలుస్తుంది. నీకు మోక్షమార్గం ప్రాప్తిస్తుంది. వచ్చే పూర్ణిమనాడు ఊరవతల వున్న పెద్ద మర్రి చెట్టుక్రింద రాత్రి ఎనిమిది గంటలకు తప్పక చూపాలి" అని సాధువు వెళ్ళిపోయాడు.

అదే దినం ముసలివాడొకడు రహీమ్ దగ్గర కెళ్ళి "ఖురాన్ చాలా పవిత్రమైనది. దీన్ని మించిన గ్రంథం ఏదీలేదు. నీవు పఠించి నీ భక్తి మహిమను నాకు చూపించినప్పుడే నీ నిజమైన భక్తి తెలుస్తుంది. అప్పుడే నీకు ముక్తి కలుగు తుంది. ఊరవతలవున్న పెద్ద మర్రిచెట్టు క్రింద వచ్చే పూర్ణిమనాడు రాత్రి ఎనిమిది గంటలకు తప్పక చూపించు" అని ముసలివాడు ఎటో వెళ్ళిపోయాడు.

ఆ రోజే ఒక కోయవాడు రాబర్టును తలుసు కుని "బైబుల్ గ్రంథం మహాగొప్పది. దీనికి లోకంలో ఏ గ్రంథం సాటిరాదు. నీవు బాగా చదువుకుని నీ భక్తితో బైబులు మహిమను నిరూపించుకున్నప్పుడే నీ నిజమైన భక్తిభావం తెలుస్తుంది. రానున్న పున్నమినాడు ఊరవతల వున్న పెద్ద మర్రిచెట్టు క్రింద రాత్రి సమయంలో ఎనిమిది గంటలకు తప్పక చూపాలి." అని ఒక దారిగుండా కోయవాడు వెళ్ళిపోయాడు.

మర్నాడు రామ్, రహీమ్, రాబర్ట్ ముగ్గురూ కలిశారు. మా హిందూమతానికి సంబంధించిన భగవద్గీత చాలా గొప్ప మహిమగలదని ఇది వరలో చెప్పాను. లోకంలో దీన్ని మించిన గ్రంథం లేదని నా గట్టినమ్మకం. నా భక్తితో దీని మహిమను పూర్ణిమనాడు ఫలానా చోట చూపా లని ఒక సాధువు నాతో చెప్పాడు. నేను ఎలాగైనా చూపాలి" అన్నాడు రామ్.

"మా ముస్లిమ్ కులానికి సంబంధించిన ఖురాన్ గొప్ప పవిత్రమైనదని లోగడ వివరిం చాను. దీనికి మరేపుస్తకం సాటిరాదని నా ధృఢ నమ్మకం. దీని మహిమను నా భక్తితో రాబోయే పూర్ణిమ రోజు అదేచోట తప్పక చూపాలని ఒక ముసలివాడు నాతో అన్నాడు. నేను తప్పక చూపగలగాలి." అన్నాడు రహీం.

ఇక రాబర్ట్, "మా క్రైస్తవ మతానికి సంబం ధించిన బైబుల్ మహా గొప్పదని ఇదివరలో వక్కాణించాను. మా బైబుల్ గ్రంథము ఎంతో

శక్తివంతమైనది. నా భక్తి విశ్వాసంతో బైబుల్ మహిమను ఆ పూర్ణిమనాడే చూపించాలని ఒక కోయవాడు నాతో చెప్పడం జరిగింది. నేను ఏవిధంగానైనా చూపించాలి.” అన్నాడు.

అపుడు స్నేహితులైన ముగ్గురికి ఒకరి భక్తి ఒకరికి సరిపడనందున ఎక్కడలేని కోపం వచ్చి ముగ్గురూ విడిపోయారు.

ఆనాటి నుంచీ రామ్ ప్రతిరోజు దేవాలయాని కెళ్ళి ఇంకా భక్తితో శ్రద్ధగా పూజించి ఆరాధించే వాడు. భగవద్గీతను చదువుటలో లీనమైన రామ్ ఆహార పానీయాలు ముట్టుకోవడంలేదు. రహీమ్ కూడా ప్రతి దినం మసీదుకెళ్లి ఇంకా భక్తి పారవశ్యంతో నమాజు చేసి ఖురాను పఠనంలో నిమగ్నమయ్యాడు. ఆహార పానీయాలు కళ్ళతో చూడ్డంలేదు. ఇక రాబర్ట్ కూడా ఒక్క దినం విడువకుండా చర్చీకి పోయి మనస్సు నిర్మలంతో ప్రార్దనచేసి, భక్తితో బైబులును తిరగేయసాగాడు. చివరకు నీరుత్రాగడం కూడా మానేసాడు.

కొన్ని రోజులు గడిచాయి. పూర్ణిమ రానే వచ్చింది. రామ్ భగవద్గీతను చేత పట్టుకుని మర్రిచెట్టు దగ్గరికి చేరాడు. అప్పటికే అక్కడ సాధువు వున్నాడు. తాను సాధువుకు భగవద్గీత మహిమను చూపుతానో లేదోనని భయపడ సాగాడు.

రహీమ్ కూడా ఖురాను తీసుకుని ఆ చెట్టు దగ్గరకే వచ్చాడు. రహీమ్ కూడా అక్కడే ముసలి వాడు కనిపించాడు. తన ఖురాను మహిమను చూపగలనో లేనోనని గడగడ ఒణకసాగాడు.



ఇక రాబర్ట్ కూడా బైబులుతో ఆ స్థలానికి వచ్చేసరికి అక్కడ కోయవాడు ఉండటం చూసి భయకంపితుడయ్యాడు. ఎందుకంటే తన బైబుల్ మహిమని చూపగలనా అని!

ఆ తర్వాత సాధువు రామ్ వైపు చూసి “నీ భక్తి మహిమను చూపు” అన్నాడు. భయంతో వున్న రామ్ కాస్తా ధైర్యాన్ని తెచ్చుకుని నిశ్చల మైన మనస్సుతో మహిమను చూపమని దేవుని మనసారా స్మరించుకున్నాడు. ఆ వెంటనే భగవద్గీత గ్రంథము మీద ‘దేవుడు’ అను అక్ష రములు మెరుపులా అందరికి కనిపించి మాయ మయ్యాయి. అందరూ ఆశ్చర్యపడ్డారు.

ముసలివాడు రహీమ్ దిక్కున చూసి “నీ భక్తితో

మహిమను చూపించు" అన్నాడు. గడగడ ఒణుకుతున్న రహీమ్ కొంచెం ధైర్యాన్ని తెచ్చుకుని తన మనసులోనే మహిమను చూపమని 'అల్లా'ను వేడుకున్నాడు. వెంటనే ఖురాను మీద 'అల్లా' అనే అక్షరాలు మెరుపు మెరిసినట్లు అక్కడందరికి దర్శనమిచ్చి మాయమైనాయి. అందరూ నివ్వెరపోయారు.

ఇక కోయవాడు రాబర్ట్ వైపు చూసి నీ మహిమను చూపమన్నట్లు కళ్లతోనే ప్రశ్నించాడు. రాబర్ట్ భయం, ధైర్యం కల్పితంతో తమ దేవుడైన ఏసుప్రభువును మహిమను చూపమని తన మనసులో అనుకున్నాడు. అందరి కళ్ళు మెరిసేలా బైబుల్ పుస్తకంపై 'ప్రభువు' అను అక్షరాలు మెరుస్తూ అందరి కళ్ళలో పడ్డాయి. అక్కడందరు దిగ్భ్రమ చెందారు.

అపుడు సాధువు, ముసలివాడు, కోయవాడు ఉన్నపాటున మాయమైనారు. మళ్ళీ యిలా మాటలు వినపడ్డాయి. "మీరు ముగ్గురూ కూడా సమానమైన గొప్పవారు. నిజమైన భక్తులు కూడా. సర్వ కులాలు, సర్వమతాలవారికి దేవుడొక్కడే. ఒక్కోమతానికి ఒక్కోదేవుడు ఉండడు. ఆ దేవుడి మహిమ భగవద్గీత, ఖురాను, బైబులులో ఉన్నది. లోకాన్నంతటికి నేనే సిసలైన దేవుడను!" అని మాటలు వినపడ్డాయి.

ఆ మాటలు విన్న ముగ్గురూ ఆశ్చర్యపడ్డారు. తమకు వినపడ్డ మాటలు అసలైన దేవుడు మాట్లాడుతున్నాడని ముగ్గురూ తెలుసుకున్నారు. సాధువుగా, ముసలివాడుగా, కోయవాడుగా మూడు రూపాల్లో వచ్చినది ఒక్కడే అసలైన దేవుడని ముగ్గురికి తెలిసింది. తమ భగవద్గీత, ఖురాను, బైబులు, మూడు గ్రంథాలను ఒకటిగా కలిపారు.

అప్పటినుంచి రామ్, రహీమ్, రాబర్ట్ ముగ్గురూ కలసి యధాప్రకారంగా స్నేహితులయ్యారు. తమ భక్తిపారవశ్యముతో ఉండ సాగారు.





దురాశ, అసూయ, గర్వం– ఈ మూడూ ఎంతటి మనిషినైనా దహించివేస్తాయి

# వినడమూ అవసరమే !

ఒక జట్కాబండి నడిపే వ్యక్తి కుమారుడు జ్వరంతో చనిపోతాడు. తన కుమారుడు చనిపోవడంతో కలిగిన బాధను ఎవరికో ఒకరికి చెప్పి మనోభారాన్ని దించుకోవాలనుకుంటాడు ఆయనోవ్!

అతని జట్కాబండిలో ఒకడు ఎక్కుతాడు. అతనితో ఆయనోవ్, "అయ్యా, నా కుమారుడు చనిపోయాడు..." అని తన మనోవేదనను చెప్పడం ప్రారంభిస్తాడు. అయితే జట్కా ఎక్కిన వ్యాపారి మండిపడుతూ "నీ కుమారుడు ఛస్తే నాకేంటి చావకపోతే నాకేంటయ్యా? ఎదురొచ్చిన బళ్లను చూసి నన్ను తీసుకుపోవలసిన చోటుకి జాగ్రత్తగా బండి నడపవయ్యా... నీ కథంతా నాకెందుకు?" అని కటువుగా అంటాడు.

పుత్రశోకంతో అయనోవ్ జట్కా తోలుతాడు.

వ్యాపారి దిగిపోయిన తర్వాత ఒక సైనికుడు జట్కా ఎక్కుతాడు.

"అయ్యా! నా కొడుకు జ్వరంతో చనిపోయా డయ్యా..." అని అయనోవ్ ఏడ్వడం మొదలు పెడతాడు. "అదంతా సరేగానీ, ఈ నగరంలో ఎక్కడ డ్యాన్స్ జరుగుతుంది? ఎక్కడ అందమైన అమ్మా యిలు వుంటారు?" అని తన యిష్టాలను చెప్పి "అక్కడికి తీసుకు పో" అని సైనికుడు అంటాడు. అంతే తప్ప అయనోవ్ బాధ గురించి పట్టించుకోడు.

ఇలా ఆ రోజంతా తన జట్కా ఎక్కినవారితో తన కొడుకు చనిపోయిన విషయం చెప్పాలనుకుంటాడు. కానీ ఎవ్వరూ ఆ విషయాన్ని సీరియస్‌గా తీసుకోరు.

చివరికి రాత్రి ఇంటికి చేరుకుంటాడు అయనోవ్. బండి దిగి ఎవరూ తన మాట వినలేదనే బాధతో ఇంకెవరితో చెప్పుకోను అని గుర్రాన్ని పట్టు కుని కంటితడి పెడతాడు. "గుర్రమా, నా కొడుకు చనిపోయాడు..." అని ఏడుస్తాడు. గుర్రానికి తన మనసులోని బాధనంతా చెప్తాడు. వాడు చెప్పినదంతా విన్నట్లే గుర్రం తల తిప్పుతుంది. సాటి మనుషులు ఎవరూ తన బాధ పంచుకోలేకపోయారని దుఃఖంతో గుర్రంతో చెప్పి ఏడ్వడంతో కథ ముగుస్తుంది. ఈ కథ రచయిత రష్యాకు చెందిన ఆంథన్ చెకాక్!

వందేళ్ల క్రితం రష్యాలో జరిగిన సంఘటనగా దీనిని తోసిపారేయక్కర్లేదు. ఇప్పటికీ ఒక్కొక్కరి జీవితంలో జరిగే బాధే ఇది.

నేను మాట్లాడేది ఇతరులు చెవులప్పగించి వినాలి. కానీ ఎదుటివారెవరైన మాట్లాడితే మాత్రం నేను వినను అనేది సహజగుణంగా మారిపో యింది. ఎందుకనో మాట్లాడడం అనేది 'ఒన్‌వే'గా మారిపోయింది.

మాటలు చెప్పడంతో సరిపుచ్చుకుంటే సరిపోదు ఎదుటివారు చెప్పే మాట వినే ఓపికకూడా వుంటే ఎన్నో సంగతులు తెలుస్తాయి అనే మంచి గుణం అలవరచుకోవడం అవసరం.

యామిజాల జగదీశ్ - హైదరాబాద్

# నమ్మకం!

మాళవ రాజ్యంలో ఒకసారి వానలు పడలేదు.

అప్పుడు ఒక సన్యాసి మహారాజును దర్శించి, "రాజా! నేను ఒక మంత్రం పఠిస్తాను. ఆ మంత్రం పఠించగనే కుంభవృష్టిగా వర్షం పడుతుంది. కానీ మీకు, మీ ప్రజలకు నా మంత్రం మీద దృఢమైన నమ్మకం మాత్రం ఉండాలి." అన్నాడు.

అందుకు మహారాజు సంతోషంగా అంగీకరించాడు.

అనుకున్న సమయానికి రాజు పరివారంతో, ప్రజలతో నిర్ణీత స్థలానికి చేరుకున్నాడు.

అప్పుడా సన్యాసి, రాజును, ప్రజలను ఓమారు తీక్షణంగా చూసి మంత్రం పఠించి "ప్రయోజనం లేదు." అన్నాడు సన్యాసి.

"ఏం? ఎందుకని?" ప్రశ్నించాడు రాజు.

"మహారాజా! నేను మీకు ముందుగానే చెప్పాను. నేను పఠించే మంత్రం మీద మీ అందరికి పూర్తి నమ్మకం ఉండాలని. కానీ, మీలో ఎవ్వరికి నా మాటలు మీద నమ్మకం లేదని అర్థమయ్యింది." అన్నాడు సన్యాసి.

"అలా ఎందుకనుకుంటున్నారు?" మరల ప్రశ్నించాడు రాజు.

"నేను మంత్రం పఠించగానే కుంభవృష్టిగా వర్షం పడుతుందని చెప్పాను ఆ నమ్మకం మీలో ఉన్నట్లయితే గొడుగులు పట్టుకొని వచ్చేవారు. కానీ మీరందరూ వట్టిచేతులతో వచ్చారు." అంటూ ఆ స్థలాన్ని వదిలి, వెనుదిరిగి చూడకుండా సాగిపోయాడా సన్యాసి.





యస్. శ్రీదేవి తుని



# అర్హత !

విజయపురి రాజు విజయవర్మ ఆస్థానంలో మంత్రి పదవి ఖాళీ అయ్యింది. ఆ పదవికి అర్హులైన వారు కావాలని రాజు ప్రకటించాడు. మహారాజు పదవి తరువాత అంతటి పదవి మంత్రిపదవి దానికోసం ఎందరో పోటీకి వచ్చారు. రాజుగారు అందర్నీ పరిశీలించి కేశవశర్మ, మాధవశర్మ అనే ఇద్దరు యువకులను ఎన్నిక చేశారు.

అయితే ఉన్నది ఒకే మంత్రి పదవి. రాజు గారికి ఇద్దరూ సమంగా వచ్చారు. ఆ ఇద్దరిలో ఎవరికి యివ్వాలి అన్నది పెద్ద ప్రశ్న అయి పోయింది. ఇలా వుండగా ఇద్దరు నర్తకీమణులు సభా మండపానికి వచ్చి పోటీ నృత్యం చేస్తా మంటూ చెప్పారు. రాజుగారు అంగీకరించారు. వారి నాట్యం మొదలైంది. రంభా ఊర్వశులను మైమరపించేలా మత్తెక్కించేవారు మనోహర నృత్యం చేశారు. వారి నాట్యం పూర్తయింది. రాజుగారు ఆ నర్తకీమణులను సత్కరించాలని నిర్ణయించుకున్నారు. అయితే ముందుగా ఎవరిని సత్కరించాలి. వారిలో ఎవరు అందచందాలలో ...నృత్య గానాదులలో అగ్రగణ్యులు అనే అనుమానం రాజుగారికి వచ్చింది. సభవైపు చూస్తూ– "సభాసదులారా! ఇప్పుడు మనందరికీ కన్నుల పండుగ చేసిన ఈ నర్తకీమణులలో అత్యుత్తమంగా మిమ్మల్ని ఆకట్టుకున్నది ఎవరు?" అని అడిగాడు.

శభికులు ఆ ప్రశ్నకు సమాధానం చెప్పలేక పోయారు. ఎంత ఆలోచించినా వారిద్దరిలో అత్యుత్తమ వ్యక్తిని నిర్ణయించడం అసాధ్యం అయిపోయింది.

"సభికులారా! ఏం పలకరు?" అన్నాడు రాజు. అయితే ఆయనకు అర్థమయింది. తన



పరిస్థితిలోనే సభాసదులున్నారని అంతలోనే ఆయనకు మెరుపులాంటి ఆలోచన వచ్చింది. ఈ నిర్ణయం మంత్రిపదవికి ఎన్నిక చేసిన వ్యక్తులకు అప్పగిస్తే సబబు అనిపబించి వారిద్దరిని నిర్ణయించమన్నాడు.

కేశవశర్మ లేచి, ప్రభూ...! అందచందాల లోనూ నృత్యగానంలోనూ ఈ ఇద్దరూ ఒకరి కొకరు తీసిపోరు. అందువల్ల ఇద్దరినీ సమంగా సత్కరించాలని నా మనవు" అన్నాడు.

మాధవశర్మ లేస్తూ... "లేదు మహారాజా! వీరు అందచందాలలోనూ నృత్యగానాదుల లోనూ నిష్ణాతులు. వీరిలో ఎవరూ తక్కువ కాదు. అయితే నృత్య హావభావ ప్రదర్శనలు సమంగా వున్నా మొదటి నర్తకి చూపులో, భావనలో పలుకులో సౌకుమార్యత కంటే ధీరోదాత్త ఎక్కువగా కనిపించింది. నాట్యం, రాగం అనేవి సున్నితంగా ఉంటేనే రాణింపుకు వస్తాయి. రెండవ నర్తకి నడకలో సౌకుమార్యం వినయం చోటు చేసుకున్నాయి. అహంకారం కంటే సున్నితత్వం ఉన్నవారే నిజమైన కళాకారులు. అందువల్ల రెండవ నర్తకి ఉత్తమ నాట్యగత్తె అని నా అభిప్రాయం!" అన్నాడు మాధవశర్మ.

కేశవర్మకు ఆ మాటలలో పట్టరాని కోపం వచ్చేసింది. "ఇది అన్యాయం మహారాజా! అందం ఉన్నచోట అభిమానం ఉంటాలి! అభిమానస్తులకే స్వాతిశయం ఉంటుంది. నిజ మైన కళాకారిణికి తనమీద తనకు పరిపూర్ణ

మైన నమ్మకం వుంటుంది. మొదటి నర్తకి కళ్ళలో కదలికల్లో అదే వ్యక్తమైంది! ఆ మాటకు వస్తే ఆమే ఉత్తమ నాట్యగత్తె! ఒక్క ఉదాహరణ తీసుకోండి. సూర్యభగవానుడు ప్రచండ కాంతులతో ప్రకాశిస్తాడు. అది సహజ కాంతి. అది చూడ్డానికి మనుషులకు శక్తిలేదు. చంద్రుడు కాంతి హాయిగా కన్నుల పండుగ చేస్తుంది. అంతమాత్రాన చంద్రుడు సూర్యుడు కంటే ఎక్కువా?... అలాగే కళ కూడా! నిజమైన కళాకారిణిలో నేను అను అన్న కాంతి చాలా ఎక్కువగా ఉంటుంది. నాట్యం అభినయం. అందులో అహంకారమే అందం!" అన్నాడు కేశవశర్మ వాదం ముగిస్తూ.

రాజుకు సమస్య మంచుముక్కలా విడిపోయింది. సభవైపు చూస్తూ, "మంత్రి పదవిలో వీరిద్దరిలో ఎవర్ని నియమించాలా అని అర్థం కాని తరుణంలో ఈ నర్తకీమణులవల్ల నా సమస్యకు పరిష్కారం చెప్పారు. రాజు కానీ మంత్రి కానీ... కళాకారుడు కానీ,,,, అహంకారం ఉంటే అధఃపాతాళానికి పోక తప్పదు. అహం అనర్థదాయకం. ముఖ్యంగా మంత్రి పదవికి అసలు పనికిరాదు. కేశవశర్మ వాదనలో మొదటి నర్తకి నాట్యంలోలా అహంకారం కనిపించింది. మాధవశర్మ వాదంతో ఏకీభవిస్తూ రెండవ నర్తకిని ఉత్తమ నర్తకిగా ఎన్నికచేస్తూ మాధవవర్మను మా మంత్రిగా నియమిస్తున్నాం" అన్నారు.

సభికులు కరతాళ ధ్వనులు చేశారు.



ఆలోచనలు కూడా మొక్కలలాంటివే! వాటిని నీరుపోసి పెంచాలి లేకపోతే అవి వాడిపోతాయి అలాగే జీవితంకూడా

## ఏమి విత్తుదువో అదే పొందుదువు!

ఒకానొకప్పుడు ఒక ఊరిలో ఒక బీదవాడు వుండేవాడు. అత్యవసరమై అతడు పొరుగింటాయన దగ్గర ఒక 5,000 రూపాయలు అప్పు తీసుకున్నాడు. కానీ పరిస్థితుల ప్రాబల్యంవల్ల ఎంతకూ ఆ అప్పు తీర్చలేకపోయాడు. దాంతో ఆ పొరుగింటాయన కోర్టులో కేసు వేశాడు.

ఆ వ్యక్తి ఒక దయామయుడని పేరొందిన లాయర్ దగ్గరికి వెళ్ళి జరిగిందంతా విన్నవించుకున్నాడు. ఎలాగైనా తనను రక్షించమని వేడుకున్నాడు.

ఆ లాయర్, "నా ప్రయత్నం నేను చేస్తా! కోర్టువారు ఏవి అడిగినా బె..బ్బె... అను" అని ఎలా ప్రవర్తించాలో నేర్పించాడు. ఫీజు 2,000 రూపాయలుగా మాట్లాడుకున్నారు.

విచారణ ప్రారంభమైంది. కోర్టువారు అతణ్ణి ఏ ప్రశ్న అడిగినా "బె.. బ్బె..బె..బ్బె.." అనే సమాధానమిచ్చాడు. అతడు మూగవాడు, అమాయకుడు అనుకుని కేసు కొట్టేశారు.

కోర్టు బయట లాయర్ అతణ్ణి తన ఫీజు అడిగాడు.

ఆ వ్యక్తి "బె.. బ్బె..బె..బ్బె.." అన్నాడు ... ?? !!

## జిత్తులమారి నక్క - తెలివితక్కువ మేక!

ఒకానొకప్పుడు ఒక అడవిలో ఒక నక్క వుండేది. ఒక ఎండాకాలం రోజున దానికి బాగా దప్పిక వేసింది. నీటి కోసం వెతుకుతుంది. దానికి ఒక బావి కనిపించింది. దాహానికి తట్టుకోలేక అది ఆ బావిలో దూకి కడుపునిండా నీళ్ళు తాగింది. దాహం బాధ తీరాక బావినుంచి బయటికి రావడానికి ప్రయత్నించింది.

కానీ ఆ బావి చాలా లోతుగా వుంది. దాంతో ఎంత ప్రయత్నించినా బయటికి రాలేకపోయింది. అలాగే 'ఎవరన్నా వస్తారేమో?' అనే ఆశతో వుండిపోయింది.

కొద్దిసేపటి తర్వాత ఒక మేక వచ్చింది. అది బావిలో వున్న నక్కను చూసింది.

"నక్కా, నక్కా బావిలో ఏం చేస్తున్నావు?" అని అడిగింది మేక.

జిత్తులమారి నక్క వెంటనే ఒక ఐడియా ఆలోచించింది. "మేక బావా! ఈ బావిలో నీళ్ళు అమృతంలాగా మధురంగా వున్నాయి. ఎంత తాగినా యింకా తాగాలనిపిస్తుంది. నీకు కూడా దాహంగా వుంటే తాగుదువుగాని రా" అంది.

మేక ఎనకాముందూ ఆలోచించకుండా గబాలున బావిలోకి దూకింది. అది దూకడమే ఆలస్యం, నక్క దాని వీపుమీదికి ఎక్కి, అక్కడి నుంచి బయటికి దూకేసింది.

మేక బిక్కమొహం వేసుకుని వుండిపోయింది.



యామిజాల జగదీశ్ - హైదరాబాదు




హిడింబి అనే రాక్షసి హిడింబాసురుడు చెల్లెలు. వాడు మహాబలవంతుడు. పాండవుల కాలంలో హిడింబాసురుడు భీమసేనుడితో యుద్ధంచేసి ఆ వాయుపుత్రుడు చేతుల్లో దారుణంగా చచ్చిపోయాడు. మహా పరాక్రమ వంతుడైన తన అన్నను చంపిన తేజోవంతుడైన భీమసేనుడిని చూసి హిడింబి మోహించి తనను వివాహం చేసుకోమని ప్రార్థించింది. భీమసేనుడు అందుకు అంగీకరించలేదు.

హిడింబి కుంతీదేవి కాళ్ళమీద పడి– "తల్లీ...నేను అన్నను కోల్పోయాను. అయినా నాకు పగలేదు, ప్రేమించాను. రాక్షసినైనా నాకూ హృదయం ఉంది. దయవుంచి నా ప్రార్థన మన్నించమని నీ కుమారునితో చెప్పమ్మా." అని ప్రార్థించింది.

కుంతీదేవి ఆమె హృదయ ఔన్నత్యాన్ని స్త్రీ క్షమా హృదయాన్ని అర్థం చేసుకుని కుమారునితో "భీమసేనా! న్యాయమైన ఆమె ప్రార్థనను మన్నించడం నీ ధర్మం. ఆమె కోర్కె తీర్చు నాయనా!" అని ఆజ్ఞాపించింది.

మాతృభక్తి పరాయణుడైన భీమసేనుడు హిడింబిని వివాహం చేసుకున్నాడు. వాళ్ళిద్దరకూ పుట్టినవాడే ఘటోత్కజుడు. భీముని బలం.... హిడింబి మాయామంత్ర ప్రభావం రెండూ ఉన్నాయి. చిన్నప్పటి నుండీ పితృభక్తి నేర్పి ఘటోత్కజుడుని తీర్చి దిద్దింది హిడింబి.

కురుక్షేత్ర యుద్ధంలో ఘటోత్కజుడు కౌరవులను ముప్పుతిప్పలు పెట్టాడు.

ఘటోత్కజుడు ఎంత ధర్మపరుడైనా అజేయుడు రాక్షస కులంలో పుట్టినవాడు అని శ్రీ కృష్ణపరమాత్మకు తెలుసు. అతను ఆ ధర్మ

గూడూరు విజయలక్ష్మి – గణపవరం



క్షేత్రంలో కనుక మరణించినట్లు అయితే తాను మరో అవతారం ఎత్తాలి. అందుకని శ్రీ కృష్ణ పరమాత్మ అర్జునుడిని చంపడానికి కర్ణుడు ప్రత్యేకంగా దాచుకున్న శక్తి అనే ఆయుధాన్ని కర్ణుడిచేత ప్రయోగింపచేసి ఆ రాక్షసుడిని చంపేశాడు.

ఇలా రాక్షస కులంలో పుట్టినా ఘటోత్కచుడు ధర్మక్షేత్రంలో ధర్మం తరుపున పోరాడి వీరస్వర్గం అలంకరించాడు. కుమారుడిని ధర్మపరుడిగా తీర్చిదిద్ది ఆ జన్మాంతం అత్యంత పతిభక్తితో గడిపి, రాక్షసకులంలో పుట్టినా ధన్యురాలు అయిన పావనమూర్తి.

## తిడుతారేం డాడీ!!

రిపేర్ చార్జీ ముప్పైఅయిదు రూపాయలు సార్" అన్నాడు కొట్టువాడు.

రామారావు తన ఐదేళ్ళ పాపవంక కోపంగా చూసి, "ఇది చేసిన రిపేరువల్లే ఈ దండగఖర్చు" అంటూ విసుక్కున్నాడు.

ఆ పాప వెంటనే "పో డాడీ...ఆ అబ్బాయి రిపేర్‌చేస్తే డబ్బులిస్తున్నారు...నేను రిపేర్‌చేస్తే నేమో తిడుతున్నారు..." అంది.





ఆరోగ్యాన్ని జాగ్రత్తగా కాపాడుకోవాలి. లేకుంటే మనసుని చైతన్యంగా, స్థిరంగా ఉంచుకోలేము

# రహస్యాలనేవి విత్తనాలు !

ఒక్కో వయస్సులోనూ ఓ రహస్యాన్ని పదిలంగా దాచేస్తుంది. కానీ మరో వయస్సు ఆ రహస్యాన్ని అర్థంలేనిదిగా చేసేస్తుంది. అయినా ఎన్నో రహస్యాలు మనిషి మరణంతో పాటు ఎవరికీ తెలీకుండా అంతరించిపోతుంటాయి. కొన్ని సందర్భాల్లో కాలం ఈ రహస్యా లను బయటపెడుతుంది. జపాన్‌కు చెందిన ఒక డాక్యుమెంటరీ చూశాను. టైటానిక్ నౌకలో ప్రయాణం చేసి ప్రమాదం నుంచి ప్రాణాలతో బయటపడ్డ మసాబుమి హోసనా అనే వ్యక్తి గురించి తీసిన డాక్యుమెంటరీ అది.

టైటానిక్‌లో ప్రయాణీకులు ఎందరో ఉన్నప్పటికీ వారిలో ఏకైక జపానీయుడు హోసనా! జపాన్ రవాణా శాఖకు చెందిన వ్యక్తి. ఆధునిక రైల్వే రవాణా విధానాలు తెలుసుకోవడం కోసం 1919 లో ఆయనను రష్యాకు పంపుతుంది జపాన్ రవాణాశాఖ. అక్కడ ఆధునిక రవాణా పద్ధతులను తెలుసుకున్నాక ఆయన స్వదేశానికి తిరుగు ప్రయాణమవుతాడు. మార్గమధ్యంలో లండన్ చేరుతాడు హోసనా! అక్కడ టైటానిక్ నౌకలో ప్రయాణం చేస్తాడు.

అనుకోని రీతిలో టైటానిక్ నౌక మంచుగడ్డను ఢీకొని మునిగిపోతున్న విషయం తెలియక గాఢ నిద్రలో వున్న హోసనాకు హెచ్చరిక గంటానాదం వినిపిస్తుంది. ఆ శబ్దానికి లేచిన హోసనా ఏం చేయాలో తెలియక భయంతో నౌకలో తానున్న చోటునుంచి బయటకు వస్తాడు. ప్రయాణీకుల్లో మహిళలు, పిల్లల్ని కాపాడే ప్రయత్నాలు జరుగుతుండటాన్ని చూస్తాడు. దాన్నిబట్టి నౌక మునిగి పోతుందన్న వాస్తవం తెలుసుకుంటాడు. ఇక ఆలస్యం చేస్తే ప్రాణానికే ముప్పు అనే నిజాన్ని గ్రహించి ఒడ్డుకు చేరుకోవడానికి కిందామీదా పడతాడు. ఒక రక్షిత పడవలో ఇద్దరికే చోటుంది. అనే మాట వినడంతోనే హోసనా ఎగిరి ఆ పడవలోకి దూకి ప్రాణాలతో బయటపడతాడు. మరికొన్ని గంటలకే టైటానిక్ వాళ్ళ కళ్లముందే మునిగిపోయింది.

ప్రాణాలతో బయటపడ్డ హోసనాను అమెరికా పత్రికలు "అదృష్టవంతుడు" అని అభివర్ణిస్తూ వార్తలు రాశాయి. కానీ జపాన్ ప్రజలు, దేశం యావత్తు 'పిరికివాడు' అని కఠినంగా విమర్శించాయి.

"ప్రాణాపాయంనుంచి బయటపడడం నా నేరమే" అని ఒప్పుకునేలా చేయడంతో హోసనా ఎవరితోనూ ఒక్కమాటా మాట్లాడలేదు. అవమాన భారంతోనూ నలిగిపోతూ రోజులు గడిపిన ఆయన 1939లో చనిపోయాడు.

టైటానిక్ నౌక ఆఖరి క్షణాలు ఎలా వున్నాయి, ఆయన ఏఏ దృశ్యాలు చూశాడు, ప్రాణాలు కాపాడుకోవడానికి చేసిన పోరాటం అనే రహస్యాలన్నీ ఆయనతో అంతరించిపోయాయి. అయితే 50 ఏళ్ళ తర్వాత ఆయన డైరీ, భార్యకు రాసిన ఉత్తరాలు బయటపడ్డాయి. వాటిని ఇప్పుడు ప్రదర్శనకు వుంచారు. అవి హోసనా చూసిన కొన్ని దృశ్యాలే. కానీ ఆయన ప్రాణాలతో బయటపడేందుకు చేసిన ప్రయత్నాలు టైటానిక్ నౌక మునిగిపోయినట్లే ఎవరికీ తెలియకుండా పోయాయి.

రహస్యాలనేవి ఉట్టి మాటలే కావు. అవి విత్తనాలు. మన మనసనే గదిలో దాగిపోతున్నాయి. రక్షింపబడుతున్నాయి. ఇంతకూ ప్రపంచంలో మొదటి రహస్యం ఏది? రహస్యాన్ని కనిపెట్టింది ఎవరు? తెలియడంలేదు. రహస్యాలను దాచేందుకు ఒక్కొక్కరు ఒక్కో దారి ఎంచుకున్నారు.

యామిజాల జగదీశ్ – హైదరాబాదు

# భగవద్గీతా మహాత్మ్యం !

హిందువులకు అత్యంత ప్రధానమైన భగవద్గీత మహత్తును తెలుసుకుందాం.

దేవా, పరమేశా సుస్థిరమైన భక్తి ప్రారబ్ధం అనుభవించేవానికి ఎలా కలుగుతుంది అని భూదేవి అడిగింది. అప్పుడు విష్ణువు ఇలా అన్నాడు–

"దేవీ, ప్రారబ్ధం అనుభవిస్తున్నా గీతాశాస్త్రం అభ్యసించే ఆసక్తి కలిగినవాడు కర్మబంధ విముక్తి పొంది ఇహంలో సుఖంగా జీవిస్తాడు. వానికి కర్మఫలం అంటదు. గీతాపఠనం అభ్యసించిన వానిని తామరాకుపై నీటిలాగే ఏలాంటి పాపాలున్నా అంటవు.

భగవద్గీతా పుస్తకం వున్న చోట, గీతాపఠనం జరుగుతున్న చోట ప్రయాగ మొదలైన పుణ్య తీర్థాలన్నీ వుంటాయి. గీతాపాఠం జరుగుతున్న చోట వేల్పులు, ఋషులు, సనకాది యోగులు, నాగులు, గోపాలురు, గోపికలు, నారదాది మహర్షులు, ఉద్ధవాది భక్తులు గుమికూడి వుంటారు.

గీతాచర్చ, చదవడం, చదివించడం, వినడం జరుగుతున్న చోట నేను వుంటాను. నేను గీతతో వుంటాను. నాకు విశిష్టమైన భవనం గీత. గీతాతత్వంతోనే నేను ముల్లోకాలను ఏలుతున్నాను.

నా పరబ్రహ్మరూపమైన యోగ విద్య గీత. అది అర్థమాత్రాక్షరమైనది. శాశ్వతమూ. 'ఇలాటిది' అని చెప్పడానికి సాధ్యంకాదు. చిదానందమూర్తియైన కృష్ణుడు తన ముఖతః అర్జునునకు బోధించిన గీత మూడు వేదాల సారం. పరమానంద స్వరూపం. తత్వజ్ఞాన స్వరూపం గీత.

స్థిరమనస్కుడై నిత్యమూ గీత పదునెనిమిదధ్యాయాలు చదివినవాడు జ్ఞానసిద్ధిని పొందుతాడు. అంతమందు పరమపదం చేరుతాడు. పూర్తిగా చదవలేనివాడు సగం చదివినా గోదానం వల్ల వచ్చే పుణ్యం పొందుతాడు. ఇది సందేహంలేని మాట.

మూడవవంతు చదివినవాడు గంగాస్నాన ఫలాన్ని, ఆరవ వంతు చదివేవాడు సోమయాగం వల్ల వచ్చే ఫలం పొందుతాడు. రోజూ ఒక అధ్యాయం భక్తితో చదివేవాడు అంతమందు రుద్రలోకం చేరి ప్రమథగణంలో ఒకడై చిరకాలం అక్కడ నివసిస్తాడు.

భూదేవీ, అధ్యాయంలో ఒక శ్లోక పాదమైనా చదివితే ఒక మన్వంతర కాలం హాయిగా జీవిస్తాడు.

గీతలోని పది, ఏడు, అయిదు, నాలుగు, మూడు, రెండు, ఒకటి, చివరకు శ్లోకంయొక్క సగమైనా నిత్యమూ చదివేవాడు పది వేల సంవత్సరాలు చంద్రలోకంలో సుఖజీవనుడై వుంటాడు.

గీతను పారాయణం చేసేవాడు మరణించిన తర్వాత దేవగణంలో ఒకడవుతాడు.

గీతను మళ్ళీ మళ్ళీ చదివేవాడు మోక్షం పొందుతాడు. గీతను చెప్తూ మరణించినవాడు ఉత్తమ గుణం పొందుతాడు. గీతార్థాన్ని వినడానికి ఆసక్తి కలవాడెంత పాపాత్ముడైనా శరీరత్యాగం అయిన తర్వాత వైకుంఠం చేరి విష్ణువుతో ఆనందిస్తుంటాడు.

ఎన్ని కర్మలు చేసినవాడైనా గీతార్థాన్ని ధ్యానించేవాడైతే జీవన్ముక్తుడై దేహం వీడిన తరువాత పరమపదం చేరుతాడు.



యామిజాల జగదీశ్ – హైదరాబాద్

# నలుగురికి తోడ్పడాలి !

స్వామి వివేకానంద ఉత్తర భారతదేశంలోని ఒక ఊరికి వెళ్లారు. అక్కడ తమ ప్రసంగం ద్వారా నాలుగు మంచి మాటలు చెప్పారు. విరామం లేకుండా మాట్లాడుతూనే వున్నారు. సమయం సాగిపోతూనే వుంది. ఆయనను చూసేందుకు, మాటలు వినడానికి వచ్చిన వారెవరికీ స్వామి వివేకానందకు ఆహారం ఇవ్వాలనే ఆలోచనే రాలేదు. ఆ సమావేశానికి చెప్పులుకుట్టే కార్మికుడుకూడా వచ్చాడు. స్వామి వివేకానంద ఆహారం తినకుండా వుండటాన్ని గమనించి ఆయన వద్దకు వెళ్లాడు ఆ కార్మికుడు.

"నేను అంటరానివాడిని" అని అతను చెప్పాడు.

ఆ మాటవిన్న స్వామివివేకానంద "మీరు వండిన ఆహారాన్ని తినడంలో నాకు ఎలాంటి అభ్యంతరం లేదు" అని చెప్పారు. వెంటనే ఆ కార్మికుడు ఇంటికి వెళ్ళి అప్పటికే వండివున్న ఆహారాన్ని తీసుకొచ్చి స్వామి వివేకానందకు ఇచ్చాడు.

స్వామి వివేకానంద ఆ ఆహారాన్ని ఎంతో ఇష్టంతో తిన్నారు. ఈ సమాచారం ఆ వూరివారికి తెలిసింది. ఆ కార్మికుడిని అందరి సమక్షంలో ప్రశంసించారు స్వామి వివేకానంద.

"అవసరమైన సమయంలో మరొకరి అవసరాన్ని తెలుసుకుని తోడ్పడటం ఎంతో గొప్పది" అని స్వామి వివేకానంద అన్నారు. మనం ఇటువంటి స్థితిలో ఎవరికైనా సాయం చేసేమా? మనకు మాత్రం అందరూ సాయం చెయ్యాలి. కానీ మనం ఎవరికీ సాయం చెయ్యమనే తత్వం ఎంతవరకు సబబు?

మనకు నలుగురికి సాయం చేసినట్లే మనమూ నలుగురికీ సాయం చెయ్యడం భావ్యం కాదా?

సాయమనేది 'వన్ వే'గా వుండకూడదు.

రెండు వైపులా వుండాలి. ఒకరికొకరు సాయం చెయ్యడానికే మనం మనుషులుగా పుట్టాం. అటు వంటప్పుడు మనం ఎవరికీ సాయం చెయ్యకపోతే మనకూ ఎవరూ సాయం చెయ్యడానికి ముందుకురారు.

మేట్టూరు ఆనకట్టను కట్టిన ఇంజనీర్ మాణిక్యర్, ఆయన మేధావి.

ఒకసారి ఇంగ్లాండ్ రాజు మన దేశానికి వచ్చారు. ఆయన ఈ ఆనకట్టను చూసి ప్రశంసించారు. ఆయనకు ఒక కానుక ఇవ్వాలనుకున్నారు. నామక్కల్ రామలింగం వద్దకు వెళ్ళారు.

భారతమాత రాజుకి పట్టం కట్టేలాంటి చిత్రం ఒకటి గీసివ్వమని అడిగారు. ఆయన సరేనని గీసారు. ఇద్దరూ కలిసి మోటార్ సైకిల్‌లో బయలుదేరారు.

దారిలో ఉన్నట్లుండి కొందరు వీరిద్దరినీ ముట్టడించారు. ఇద్దరినీ పక్కనున్న ఒక అడవిలోకి తీసుకుపోయారు. అక్కడ మాణిక్యర్‌కు ఒక ఆలోచన వచ్చింది. "నేను ఒక స్వాతంత్ర్య దళ నేతను. నా వద్ద ఎందరో వున్నారు ఇంగ్లండ్ రాజు కార్యక్రమాలను అడ్డగించేందుకు పథకం పన్నాను. దానికోసమే నేను పోతున్నాను" అని అన్నారు.

ఆ మాటలు విన్న ఆ బృందం వారిద్దరినీ విడిచిపెట్టారు. అన్నం పెట్టి కొంత డబ్బిచ్చి పంపించారు. తమను చుట్టుముట్టినవాళ్లు ఆంగ్లేయులకు వ్యతిరేకంగా పోరాడే బృందమని క్షణంలో గ్రహించి మాణిక్యర్ సమయస్ఫూర్తితో వ్యవహరించడం విశేషం.

యామిజాల జగదీశ్ - హైదరాబాద్

# అన్నీ బొమ్మలే!

మంచమనేది కలలు వికసించే చోటని అంటే మంచం కింద కలలు రాలిపోతాయని చెప్పవచ్చా? పిల్లలున్న ఇంట్లో మంచం కింద రహస్యగుహలా దాక్కుని ఆడటం తెలిసిందే కదా? చాలా ఇళ్ళల్లో మంచం కింద వస్తువులు వుంచడమూ చూడవచ్చు.

మంచం కింద అనేది సముద్రం పొట్టలో దాగిన రహస్యమని చెప్పుకోవచ్చు?

మంచం కిందకు వంగి వెతికేటప్పుడు చేతికి ఏదో ఒక వస్తువు దొరకడం మామూలే. కొన్ని రోజుల క్రితం టేబుల్ తాళంగుత్తి కనిపించకుండా పోయినప్పుడు వెతుకుతుంటే పాప ఎప్పుడో విసిరేసిన బొమ్మ ఒకటి మంచం కింద దొరికింది. అది ఎప్పటినుంచి మంచం కింద వుందో తెలీదు. పసుపురంగు బొమ్మ అది. అయితే ఇక్కడ చెప్పుకోవలసిందేమిటంటే ఆ బొమ్మకు తల భాగం లేదు. అది మనసుని నొప్పించింది. పైగా ఆ బొమ్మ ఆడబొమ్మ కావడం మరింత బాధ వేసింది.

కొన్నప్పుడు ఆ బొమ్మ గులాబీరంగులో వుండేది. రెండు జడలు వేసుండేవి. కళ్ళు అసలైనవిలా అనిపించేవి. ఆ రూపం గుర్తుకొచ్చింది. ఆ బొమ్మతో మా అబ్బాయే కాదు ఇంటికొచ్చిన చిన్న పిల్లలు ఆటాడుకునేవారు. ఎందరి చేతుల్లోనో ఆడుకున్న ఆ బొమ్మ యిప్పుడు తల లేకుండా కనిపించింది. ఆ బొమ్మ చూసినప్పుడల్లా నాకు 'ది లాస్ట్ ఎంపరల్' అనే సినిమా గుర్తొచ్చేది.

తన దేశాన్ని, రాజభవనాన్ని సంపదను కోల్పోయిన చైనా దేశపు చివరి వంశీకుడైన యువరాజుని తన సొంత భవనంలో నౌకరుగా వుంటాడు. అక్కడికి వచ్చేవారందరికి ఆ భవనం గురించి వివరించేవాడు. ఆ వివరాలన్నీ నీకు ఎలా తెలుసు అని అడిగితే "నేనే ఈ భవన యువరాజుని" అని చెప్పేవాడు. భవనానికి చూడ్డానికి వచ్చిన వారిలో చిన్నవాళ్లెవరూ నమ్మేవారుకాదు!

వారిని నమ్మించడం కోసం తాను చిన్న వయస్సులో దాచిన ఒక బొమ్మను వెతికి చూపించే వాడు. ఆ బొమ్మ ఒక్కటే అతనిక్కడ వుండేవాడనేందుకు సాక్ష్యం. ఒక్కొక్కసారి బాల్యంలోనూ ఇటువంటి గుర్తులు ఏవో ఒకటి వుంటాయి. ఎన్ని ముద్దులో ఎన్ని ఓదార్పులో ఎన్ని జాలిపాటలో ఎన్ని లాలిపాటలో చూసిన తనకున్న బొమ్మ యిప్పుడు తలకాయ లేకుండా వుంది.

ఇంతలో నా చిన్నోడు ఎటువైపు నుంచోవచ్చి "నాన్నా ఆ తలలేని బొమ్మ ఎందుకు నాన్నా" అని నా చేతిలోంచి లాక్కుని బయటకు విసిరేసినప్పుడు మనస్సు చివుక్కుమంది.

ఇష్టం చెదరినప్పుడు మిగిలేదంతా బాధే అని ఆ తలలేని బొమ్మతో మరోసారి బోధపడింది. కుర్రాడు పెరిగి పెద్దవుతున్నప్పటికీ బొమ్మమాత్రం అలానే వుంది. పైపెచ్చు తలకూడా లేకుండా పోయింది. ఇంతకూ దాని తల ఎక్కడుందో ఏమిటో? ఎంత వెతికినా తల దొరకలేదు.

ఒక బొమ్మను బొమ్మగా వుంచగలిగేమా? నువ్వూ బొమ్మవి నేనూ బొమ్మని అనే ఒక పాటొకటి రేడియో ఎఫ్ఎం లోనుంచి వినిపించింది. ఈ పాట కొనసాగింపుగా మరొక వాక్యం- తలచుకుంటూ అన్నీ బొమ్మలే అని. నాకా పాట నచ్చడం అప్పటినుంచే.

యామిజాల జగదీశ్ - హైదరాబాద్




"అమ్మా! ఈ వేళ నా ఫ్రెండ్సందర్నీ భోజనానికి పిలిచాను... చివరి పరీక్ష కదమ్మా... ఈ రోజు అయిపోతే యిక మళ్ళీ మే మంతా కలుసుకోలేక పోవచ్చు. ఎవరి దారులు వాళ్ళవే... అందుకని అందరినీ పిలిచానమ్మా ప్లీజ్... మా బంగారు మమ్మీ కదూ.- నా ఫ్రెండ్సందరికీ యివాళ వంట చేస్తోంది అమ్మ" అంటూ తల్లి భుజాలమీద చేతులు వేసి గారాలుపోయాడు సిద్ధార్థ.

కూరలు తరుగుతోన్న శారద ముందు ముఖం చిట్లించినా కొడుకు మరీ అంతలా బ్రతిమలాడ్డంతో మరేమీ అడ్డు చెప్పలేక పోయింది.

"ఏరా అన్నయ్యా! పరీక్షయిపోతే విడిపోతున్నామన్న జ్ఞానం నీ ఒక్కడికేనా మరి మిగిలినవాళ్ల కేమీలేదా? మరి నువ్వొక్కడివే ఎందుకు భోజనానికి పిలుస్తున్నట్లు?" సిద్ధార్థ తర్వాతివాడు గౌతమ్ ప్రశ్నించాడు.

"నువు నోర్మూసుకో! నువ్వూ పదో తరగతి చివరి పరీక్ష వ్రాసే నాటికి నీకూ తెలుస్తుంది ఆ బాధేమిటో!" బాధగా చెప్పాడు సిద్ధార్థ.

సిద్ధార్థ చాలా సెన్సిటివ్... రక్త సంబంధాని కన్నాగూడా స్నేహానికే విలువ నిచ్చే వ్యక్తి.

"పోన్లేరా! వాడిమీదెందుకు విసుక్కుంటావు! అలాగే నీ ఫ్రెండ్స్‌ని తీసుకురా! అమ్మ వంట చేసి పెడుతుందిలే గానీ ముందు నువ్వు పరీక్ష బాగా వ్రాయి. వాళ్ళని భోజనానికి పిలిచే ధ్యాసలో పడి వ్రాయడాన్ని నిర్లక్ష్యం చేసేవ్?!" హెచ్చరించాడు తండ్రి.

"అదీ నిజమే...! కంగారు పడకుండా పరీక్ష వ్రాయి! అదే ముఖ్యం నీకు!" చెప్పింది శారద.

వి. మోహిని- చెన్నై



"అలాగేనమ్మా" తన తల్లితో చెప్పి స్కూలికి వెళ్ళిపోయాడు సిద్ధార్థ.

అనుకున్న ప్రకారమే వంట పూర్తిచేసి కొడుకు కోసం, అతడి స్నేహితుల కోసం ఎదురు చూడసాగింది శారద. సిద్ధార్థకి పదహారేళ్ళు... సిద్ధార్థకి స్నేహితులంతా దాదాపు అదే వయసులో, ఇంచుమించు అదే ఎత్తులో వుంటారు. వట్టి అల్లరి మూక. తనెప్పుడూ చూడలేదు కానీ స్కూల్లో వాళ్ళంతా కలిసి పిక్నిక్కు వెళ్ళినపుడు వాళ్ళు చేసిన అల్లరిని గురించి గౌతమ్ చాలా రోజుల వరకూ కథలు కథలుగా చెప్తుండేవాడు. దాంతో శారదకి భయం పట్టు కుంది. ఈ రోజు ఎలా ఇబ్బంది పడాల్సి వస్తుందోనని.

దాదాపు 2 గం॥ 30 నిమిషాలు తరువాత వచ్చారు అంతా.

అందరూ కూర్చుని వ్రాసిన పేపరు గురించీ, భవిష్యత్తు గురించీ పదే పదే మాట్లాడు కోసాగారు.

"ఇప్పటికే చాలా ఆలస్యమై పోయింది! రండి భోజనాలకి! తర్వాత మాట్లాడుకుందురు గాని" పిల్చింది శారద.

తల్లి పిలుపు వినగానే మంత్రించినట్లుగా సిద్ధార్థతో పాటు మిగిలిన పిల్లలంతా లేచి నిల్చున్నారు.

అసలేమాత్రం అల్లరీ, గొడవా లేకుండా ముచ్చటగా, బుద్ధిమంతుల్లా తలలు వంచుకుని కావలసింది అడిగి పెట్టించుకుని, ఒక్కొక్క కూరా రుచి చూసినప్పుడల్లా శారదని తెగ పొగిడేస్తూ భోజనాలు ముగించారు.

శారద కా పిల్లలు ఎంతగానో నచ్చారు. ఈ రోజు తన శ్రమ వృధా పోలేదన్నట్లుగా సంతృప్తి పడింది శారద.

"మీరు కూరలు చాలా రుచికరంగా చేశారండీ."

అసలు మిమ్మల్ని చూస్తోంటే మా కెంతో ఆశ్చర్యంగా వుంది! మీ రెంతో ఉత్సాహంగా వయసు కన్నా చాలా చిన్నగా కన్పిస్తున్నారు!" ఇదెలా సాధ్యం? మిమ్మల్ని అభినందించకుండా



చెడు ఆలోచనలు రాకుండా జాగ్రత్త వహించండి. మంచి బుద్ధితో శ్రద్ధపెట్టి మంచి ఆలోచనలపై దృష్టిసాధించండి

వుండలేక పోతున్నాం!" చెప్పాడు కృపాకర్ సిద్ధార్థ స్నేహితుడు.

నవ్వింది శారద మొహమాటంగా.

"నిజమండీ! మీరు చాలా చిన్నగా వున్నారు! అవునూ... మీరు ప్రతి రోజూ ఎక్సర్‌సైజులు చేస్తూంటారా?"

"అబ్బే అదేం లేదయ్యా!" సిగ్గుపడిపోతూ చెప్పింది శారద. వాళ్ళంతా అలా తను చాలా చిన్నగా వున్నానంటూ పొగుడుతూంటే శారదకి మొహమాటంగానూ, సిగ్గుగానూ వుంది. మనసు లోపల్లోపల ఆనందంగాకూడా వుంది.

ఈ పిల్లలంతా మళ్ళీ ఓ రోజు వచ్చినా తను సంతోషంగా వండి వడ్డించగలదు.

"వెళ్ళొస్తామండీ!" సిద్ధార్థ స్నేహితులంతా సెలవుతీసుకుని వెళ్ళిపోయారు.

"నీ స్నేహితులంతా చాలా బుద్ధిమంతుల్రా! అల్లరి చేస్తారేమో, కూరలకి వంకలు పెడతారేమో నని భయపడ్డాను ముందు. కానీ అలా లేరు" చెప్పింది శారద ఆ రాత్రి భోజనాలయ్యి అంతా డాబామీద కూర్చున్నప్పుడు.

అసలు మీకు తెలుసాండీ? నేను నా వయసు కంటే చాలా చాలా చిన్నదానిలా కన్పిస్తున్నా నట! 'మీరు ప్రతి రోజూ! ఎక్సర్‌సైజు చేస్తారా.. లేక...అమృతం త్రాగారా? ఇలా ఎలా వుండ గలుగుతున్నారు?' అంటూ తెగ ఆశ్చర్యపోయా రనుకోండి నన్ను చూసి!" మురిసిపోతూ చెప్పింది శారద భర్తతో.

అప్పుడు నోరు విప్పాడు సిద్ధార్థ.

"అమ్మా! నిన్ను మా 'అమ్మమ్మ!' అంటూ చెప్పాను స్నేహితులతో" చెప్పాడు కొంటెగా.

పొట్ట చెక్కలయ్యేలా నవ్వుతోన్న భర్త వంక ఉడుక్కుంటూ చూసింది శారద.



నీ జీవితంలో జరిగిన విషయాలను తలచుకొని బాధపడేకన్నా ముందు భవిష్యత్ గురించి ఆలోచించండి

# పొదుపు ! - దాని ఆవశ్యకత !

ప్రతి మానవుడు పొదుపును పాటించాలి, తను సంపాదించిన ధనము, మరికొన్ని వస్తువులను కొంత ఖర్చుచేసి మిగతాది లేని సమయంలో వాటిని ఉపయోగించుకోవాలి. కొందరు దొరికిన వాటిని ముందు వెనుకలు చూడకుండా, ఖర్చుచేస్తూ వుంటారు.

మహాత్మా గాంధీగారు, తప్పకుండా పొదుపును పాటించేవారు. వారిని ఎవరితోను సమానంగా చెప్పడానికి వీలు లేదు. వారికి వారే సాటయినవారు.

మహాత్మా గాంధీగారు ఒక పంచను మాత్రమే కట్టుకుంటారు. అది చినిగిపోతే రెండుగా చింపి, ఒకదానిని తనకు కండువాగాను, మరొకటి చేతిరుమాలుగాను చేసుకుంటారు. వాటిలోను ఒకటి చినిగిన తరువాత తనకు కౌపీనముగాను వాడుకుంటారు. అటువంటి మనసు కలిగినవారు, పనికిరాదని ఏదీ వదలకుండా, పొదుపును ఆచరించే గొప్పవారు.

ఒక ఊరిలో రాజు, రాణి ఉండేవారు. వారి రాజ్యాలు పోయినా, వాళ్ల వుండటానికి రాజమహలు, మరి కొందరు సేవకులు వుండేవారు. భారత ప్రభుత్వము వారి జీవనానికై అప్పటి కాలంలో నెలకు పదివేల రూపాయలు భరణంగా ఇచ్చేవారు.

ఆ రాణి రాజులిరువురు ఆ భరణంతో జీవితం సాగిస్తూ వచ్చేవారు. భవనాలు, మహలులు ఒకే విధంగా వుంటుందా? చాలా సంవత్సరాలు కావడంవల్ల మహలు పాతబడిపోయింది. అక్కడక్కడ గచ్చులు కూడా పడిపోయాయి. అందువలన రాజదంపతులు భవనం రిపేరుచేయడానికి నిర్ణయించు కున్నారు. అనేక మంది ఇంజనీర్లను రప్పించి భవన నిర్మాణంలోని కొన్నిటిని బాగుచేయాలని, ఎంత అవుతుందని వారిని అడిగితే వాళ్లు సుమారుగా 20, లేక 30 లక్షలు అవుతుందని తెలిపారు.

ప్రభుత్వం ఇచ్చే భరణం చాలీచాలకుండా వుంది, అంతటి డబ్బు ఎలా తేగలము.. అని విచార పడ్డారు. ఇరువురూ ఒక నిర్ణయానికి వచ్చి డబ్బు ఖర్చుపెట్టకుండా, తన భవనాన్ని తీర్చిదిద్దాలని అనుకున్నారు. వాళ్లు ఉపయోగించిన కత్తులు, కటారులు, ఫోటోలు, నమూనాలు, మొదలగునవి అక్కడక్కడ వుంచి ఒక ప్రదర్శనశాలను (మ్యూజియం)ను ఏర్పాటుచేసారు.

రాజాంతఃపురాన్ని చూడనివారికి ప్రవేశ రుసుముగా మనిషికి 10/- రూపాయలు నిర్ణయించి, చూడడానికి అనుమతించారు.

ఈ విషయము తెలిసిన, నగర ప్రజలు, పొరుగూరినుండి వచ్చే ప్రజలు, అచ్చటి వస్తువులను, రాజాంతఃపురాన్ని చూడడానికి తండోపతండములుగా రాసాగిరి.

ఈ విధముగా ఆరు నెలలు గడిచింది. సందర్శకుల ద్వారా వచ్చిన ధనము చాలా వచ్చింది.. ఆ దంపతులు సంతోషముతో రాజమహలును సర్వాంగ సుందరముగా తీర్చిదిద్దారు. గనుక మానవుడు సమయానుకూలముగా కొన్ని నిర్ణయాలు తీసుకుని, వాటిలోని పొదుపు పద్ధతిని పాటించిన యెడల వారి జీవితము సుఖంగా, ఆనందంగా వుంటుంది.



ఆర్. వసంత - తిరుపతి

# 20 లక్షల రూపాయల బల్లి!

మణిపూర్ రాష్ట్రంలో ఒక అరుదైన బల్లి జాతి సంతతి తరిగిపోతోంది. ఆ బల్లి ఒక్కొక్కటి ఇరవై లక్షల ధర పలుకుతోంది. దాంతో ఆ బల్లుల ఆచూకీ కోసం మణిపూర్ వాసులు భారీ సంఖ్యలో వెతుకులాటలో పడ్డారు!

ఆ బల్లిపేరు **టొకాయ్ జీకో!**

నేపాల్, బంగ్లాదేశ్, ఫిలిప్పీన్స్, ఇండోనేషియా తదితర దేశాల్లో దట్టమైన అడవులలో నివసించే బల్లి జాతి ఇది.

మన దేశంలో మణిపూర్ రాష్ట్ర అడవులలో ఇవి గుంపులు గుంపులుగా నివసిస్తుంటాయి. ఒకటిన్నర అడుగుల పొడవు వరకు పెరిగే ఈ బల్లి నాలుగు వందల గ్రాముల వరకు బరువు వుంటుంది. నీలివర్ణంతోనూ బూడిద రంగులో వుంటుంది. వాటిపై పసుపురంగు మచ్చలుంటాయి.

ఈ బల్లులను మందుగా తయారుచేస్తారు. ఆ మందువలన వీర్యశక్తి వృద్ధిచెంది పిల్లలు పుడతారు. క్యాన్సర్ నయం చెయ్యడానికి ఈ బల్లి నుంచి తయారుచేసిన మందు ఎంతో ఉపయోగకరంగా వుంటుంది. ఈ విషయం తెలుసుకున్న జనం వీటిని వేటాడటంలో పోటీపడుతున్నారు. అయితే శాస్త్రీయపరంగా ఇందులో ఎలాంటి వాస్తవం లేదన్నప్పటికీ ఆసియాలోనూ, ఐరోపాలోనూ అప్పటికే దీనిపై ప్రచారం జరగడంతో డిమాండ్ పెరిగింది.

ఒక అడుగుకంటే కొంచెం తక్కువ పొడవుండి 200 గ్రాముల బరువుగల బల్లికి ఇరవై లక్షల రూపాయలదాకా ఆదాయం లభిస్తుంది. అయిదు బల్లులను పడితే కోటీశ్వరుడు కావచ్చనే ఆశతో అనేకమంది వీటిని పట్టుకోవడం కోసం అక్కడి అడవులలో తిరుగుతున్నారు. వీరిలో విదేశీయులు కూడా వుండటం విశేషం. గత ఆరు నెలల్లో 70 బల్లులను స్మగ్లర్ల నుంచి విముక్తి కల్పించారు.

చాలామందికి చిన్న బల్లులే దొరుకుతున్నాయట! అలా దొరికేవాటిని సైతం విడిచిపెట్టడం లేదు. వాటిని పర్వతప్రాంతాల్లో నివసించే గిరిజనులకు యిస్తారు. వాటిని పెంచి పెద్దదిచేసి ఇవ్వవలసిందిగా ఒప్పందం చేసుకుంటారు. పర్వతప్రాంతాల్లో ఎదిగే బల్లులు ఆరోగ్యవంతంగా వుంటాయట. ప్రత్యేకించి అవి తగినంత బరువు వచ్చే విషయం తెలుసుకున్న తర్వాత డబ్బిచ్చి తీసుకు పోతుంటారు.

ఇలా ఈ రకం బల్లుల వల్ల మంచి లాభమే వుంటుంది. అంతేకాదు అనేకులు వ్యవసాయానికి గుడ్ బై చెప్పి ఈ బల్లి వేటలో పడ్డారు.

జగదీశ్ యామిజాల - హైద్రాబాద్

## జంతులోకం!

- ఉడుతలు 267 రకాలు వున్నాయి. ఇవి ఎక్కువగా విత్తనాలపైనే ఆధారపడి జీవిస్తాయి. ఇవి బొరియల్లో దాక్కుంటాయి.
- విశ్వాసానికి మారుపేరైన గ్రామసింహాలు నాలుగు వందల రకాలు వున్నాయి. మగ కుక్కను కుక్క అని, ఆడ కుక్కను బిచ్ అని, చిన్నవాటిని పప్ అని అంటారు!
- మగ పిల్లిని టామ్ అని, ఆడ పిల్లిని క్వీన్ అని, చిన్నవాటిని కిటిన్స్ అని పిలుస్తారు!
- ఆఫ్రికా ఏనుగులు పన్నెండున్నర అడుగుల ఎత్తు పెరుగుతాయి. వీటిలో మూడు రకాలు ఉన్నాయి. అవి సావన్నా ఎలిఫెంట్, కేర్ ఎలిఫెంట్, ఫారెస్ట్ ఎలిఫెంట్. ఆసియా ఏనుగులు నాలుగు రకాలవి. అవి ఇండియన్ ఎలిఫెంట్, సిలోన్ ఎలిఫెంట్, సుమతా ఎలిఫెంట్, మలేషియా ఎలిఫెంట్ అని మరో రకానిది కూడా వుంది. ఆఫ్రికా ఏనుగులకు చెవులు చాలా పెద్దవిగా వుంటాయి.
- రైనోసర్‌ల బరువు దాదాపు 3,600 కిలోల వరకు వుంటుంది. పెద్దవాటికి జుత్తుండదు.
- ఊసరవెల్లుల కళ్లు రెండూ వేటికవే అటూ ఇటూ కదులుతాయి. ఒక కన్ను పైకి చూస్తున్నప్పుడు మరొక కంటితో కిందకు చూడగలదు ఊసరవెల్లి!




Edited & Published by G.A. Rao at 21/3, Rajabather Street, T.Nagar, Chennai-17, Phone - 28152043, 28150423
Printed at Sakthi Precess, Chennai - 81 for Ramanjaneya Press, Rajahmundry

REGD.No.TN/CH©/185
Date of Publication :- 4-9-1974
23rd , 24th of Every Month

BUJJAYI FEBRUARY 2013